

చందమామ సంపుటి: 60 ఏప్రిల్ 2008 సంచిక:04

## ఈ నెల విశేషాలు

















## ఈ సంచికలో...





వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

ప్రియమైన పాఠకులకు సర్వధారి ఉగాది శుభాకాంక్షలు!
మీ అభిమాన చందమామ కథలు ప్రస్తుతం chandamama.com/telugu వెబ్‌సైట్‌లో వస్తున్నాయి. లాగ్ ఆన్ చేసి చదివి ఆనందించండి!

-సం.





# విద్యావిధానంలో మార్పు అవసరం

మార్చ్, ఏప్రిల్, మే మాసాలలో విద్యార్థులు బలమైన మానసిక ఒత్తిడికి లోనవుతూ ఉంటారు. సంవత్సరం పొడవునా చదివిన చదువుల విజయాలు సంవత్సరం చివర జరిగే పరీక్షల ఫలితాలుగా వెలువడే సమయం ఇది. పరీక్షలలో విజయం సాధించడానికీ, వీలయితే సహాధ్యాయులను అధిగమించడానికీ ఆశించి ప్రయత్నించడం సహజమే.

ఈ పందెంలో విద్యార్థులే కాదు; వారి తల్లిదండ్రులు కూడా పాల్గొంటూ తాము ఒత్తిడికిలోనై, పిల్లలను మరింత ఒత్తిడికి లోను చేస్తూ ఉంటారు. పర్యవసానంగా అనుకున్నది అందుకోలేనప్పుడు విద్యార్థులు విపరీత చర్యలకు పాల్పడుతూ ఉంటారు. సంవత్సరం చివరి పరీక్షలలో వచ్చే మార్కులను బట్టే విజయం స్థాయి నిర్ణయించబడుతుంది. చదివే ప్రతి పాఠ్యాంశంలో ప్రతి విద్యార్థీ ప్రథమస్థానం సాధించాలంటే సాధ్యమయ్యే పనేనా? ఇది ఆలోచించవలసిన విషయం. ఈ విషయంలో మాజీ రాష్ట్రపతి డా. ఎ.పి.జె. అబ్దుల్ కలాం ఏమంటారో చూద్దాం: ''మార్కులు ఒక నిర్దిష్ట పాఠ్యాంశంలో సముపార్జించిన జ్ఞానాన్ని మాత్రమే సూచిస్తాయి. అవి ప్రవర్తనకు కొలమానాలు కావు. బాధ్యతాయుతమైన పౌరులుగా అభివృద్ధి చెందాలంటే-జ్ఞానానికి ఉన్నతమైన విలువలు, ఉత్తమమైన ప్రవర్తన జత కావాలి.'' ఆయన ప్రవర్తనకు ఇచ్చే ప్రాధాన్యతను గమనించారు కదా.

పరీక్షలలో సాధించే మార్కులు చాలా ముఖ్యమే. అయినప్పటికీ, గ్రేడ్లు ఇచ్చేప్పుడు పరిపూర్ణ వ్యక్తిత్వవికాసంలోని ఇతర అంశాలను కూడా పరిగణనలోకి తీసుకోవాలి. విద్యార్థులను బాధ్యతాయుతమైన పౌరులుగా తీర్చిదిద్దడంలో ఉపాధ్యాయుల పాత్ర గురుతరమైనది. ఈ విషయంలో వెనుకంజ వేసినట్టయితే అది మన విద్యావిధానంలోని లోపాన్ని సూచిస్తుంది. అరవైయేళ్ళ స్వాతంత్ర్యం తరవాత కూడా మారుతూన్న కాలంతో పాటు మారలేదని తెలుస్తుంది. కష్టపడి సాధించిన స్వాతంత్ర్యాన్ని యువతరం సంక్షేమం కోసం సక్రమంగా ఉపయోగించుకోవలసిన అవసరం ఉన్నది!

సంపాదకుడు : **విశ్వం**








చందమామ

Editor, Publisher : B. Viswanatha Reddi (Viswam)
Chief Executive Officer : L. Subramanyan
Editorial Advisors : Ruskin Bond, Manoj Das
Consultant Editor : K. Ramakrishnan
Associate Editor : A.R. Balasubrahmanyam
Artists: K.C. Sivasankaran (Sankar)
Gandhi Ayya, P. Mahesh
Layout Design: R. Sudha
Assistants: D. Revathy, B.A. Hemalata Malini
Research : R. Vaasugi

CIRCULATION TEAM :
Chennai : T N Ravi Shankar, National Sales Manager
Mobile +91 99620 70014
email: ravishankar.tn@chandamama.com
Mumbai : Rajendra K Jadhav, Asst. Manager - Circulation
Mobile +91 9271720669
CHANDAMAMA INDIA LTD., B-3, Lunic Industry
Opp. State Bank of India, Near Police Station Cross Road
No.6, MIDC Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email: rajendra.jadhav@chandamama.com
New Delhi : Sushil Sharma, Circulation Manager-North
Mobile +91 98719 30767
CHANDAMAMA INDIA LTD., Goyal Business Centre,
C-23/2 First floor, Connaught Place, New Delhi-110001
Bangalore : P. Murali, Asst. Circulation Manager -Karnataka
Mobile +91 94488 36952
CHANDAMAMA INDIA LTD., 18, 10th Cross, Mayura Street
Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage
Bangalore-560094, Phone +91 80 6655 1000
email:murali.p@chandamama.com
Kolkata : Ananth Prakash, Circulation Manager-East
Mobile +91 98351 82202
email : ananth.prakash@chandamama.com
Advertisement : email : sales@chandamama.com
Online and Interactive : Surajit Agarwal
Mobile +91 99620 70015
email: surajit.agarwal@chandamama.com
Head Office : CHANDAMAMA INDIA LTD.,
JVL Plaza, Block-A, 6th Floor, 626, Anna Salai, Teynampet
CHENNAI-600018, Phone +91 44 2432 2101/02,
Fax +91 44 2432 2103
email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

చందా

ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ.180.00
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ,
మనిఆర్డర్ ద్వారాగానీ 'చందమామ
ఇండియా లిమిటెడ్' పేరిట పంపండి.


# పాఠకుల లేఖలు

**రూ. 250/- బహుమతి పొందిన లేఖ**

చిన్నారులకు చక్కటి విజ్ఞానం అందించే మాస పత్రిక 'చందమామ' ఫిబ్రవరి నెల అందమైన ముఖచిత్రంతో వెలువడింది. ముఖ్యంగా ఈనెల విజ్ఞానదాయకమైన విషయాలు చిన్నారులకు ప్రయోజనకరంగా వున్నాయి. చందమామ చదవడం చిన్నారులకు ఎంతో విజ్ఞానదాయకం. 'మాయదారి జబ్బు' కథ పదిమందికోసం జీవించడం నేర్చుకుంటే తృప్తి, ఆనందం మిగులుతాయి అన్న సందేశాన్నిచ్చింది.

అదే విధంగా 25 ఏళ్ళనాటి చందమామ కథ బంగారు బాతుగుడ్లు కథ సందేశాత్మకంగా వుంది.

ఎవరి విధులు వారు సక్రమంగా నిర్వహించుకోవాలని 'సూర్యునితో పందెం' జాతక కథ ద్వారా నిరూపించారు. కథల ఎంపికలో చందమామ సంపాదకవర్గ సభ్యులు అభినందనీయులు. చిన్నారులను విజ్ఞానలోకంలో విహరింపజేసేలా చందమామ కబుర్లు శీర్షిక ద్వారా చక్కటి విషయాలు వివరిస్తున్నారు. పిల్లలకు 'బాలగేయాలు' శీర్షిక ప్రవేశపెట్టగలరు. తద్వారా చక్కని పాటలు, గేయాలు అందించగలరని ఆశిస్తున్నాను. – ఎల్.పి. చంద్ర

ధర్మవరం - 515 672, అనంతపురం జిల్లా

పిల్లలకు ఆదర్శంగా ఉంటూ తల్లిదండ్రులు వారిని తీర్చిదిద్దే బాధ్యత గురించి తెలియజేసిన సంపాదకీయం బాగుంది. 'మూడు కలలు' కథ పాలకులకు సంబంధించినది. చాలా ఆసక్తికరంగా సాగింది. రామాయణంలో కిష్కింధాకాండ మంచి రసపట్టులో ఉంది. జాతక కథలు పిల్లలను, పెద్దలను ఆకట్టుకుంటున్నాయి. బీర్బల్ కథలు గుడ్లగూబల భాష అక్బరులాంటి రాజులకు కళ్ళు తెరిపించే విధంగా ఉన్నాయి. కార్డు కవితలకు చందమామలో ఒక పేజీ కేటాయిస్తే బాగుంటుంది. అమరవాణిలాంటి కొటేషన్స్ పెంచండి.

– శ్రద్ధ పులిజాల, హైదరాబాదు-500 040



# కథకు పట్టం

కాకడదేశాన్నేలే కృష్ణభూపతి పట్టపురాణి జ్యోత్స్నాదేవి. రాజదంపతులిరువురూ రాజోచిత విద్యల్లో దాదాపు సమఉజ్జీలుగా ఉండేవారు. భానుదేశాధీశుడి ఏకైక కుమార్తె అయిన జ్యోత్స్నాదేవి అందచందాల్లో, గుణగణాల్లో, మేధస్సులో సాటిలేని మేటి అని విన్న కృష్ణభూపతి, ఆమెను ఏరి కోరి వివాహం చేసుకున్నాడు. పట్టపురాణిగా కాకడదేశానికి వచ్చినది మొదలు జ్యోత్స్నాదేవి, పరిపాలనా విషయాల్లో కూడా భర్తకు చక్కని సలహాలు ఇస్తూ ఉండేది. భార్య ప్రోత్సాహంతో రాజు, తరచూ మారువేషంలో వెళ్ళి ప్రజల మంచిచెడ్డలూ, కష్టసుఖాలూ ప్రత్యక్షంగా తెలుసుకుంటూ ఉండేవాడు. ఒక్కోసారి రాణికూడా మారువేషం వేసుకుని ఆయన వెంట వెళ్ళేది.

ఒకసారి కృష్ణభూపతి, నడివయసు పెద్ద మనిషిలా వేషం వేసుకుని నగర సంచారానికి బయలుదేరాడు. ఆయన నగరంలోని ఒక సత్రాన్ని సమీపిస్తూండగా, దాని అరుగుమీద మధ్య వయస్కులైన భార్యాభర్తలిద్దరు కూర్చుని మాట్లాడుకుంటూ కనిపించారు. కృష్ణభూపతి గుర్రం దిగి, వారికి కాస్త ఎడంగా అదే అరుగుమీద కూర్చున్నాడు.

"నగరానికివచ్చి నాలుగురోజులు దాటింది. వెంట తెచ్చుకున్న రూకలు తరిగిపోతున్నవిగాని, రాజదర్శనం మాత్రం కాలేదు. అయినా నేను చెబుతూనే ఉన్నాను. కథలు చెప్పడం ఏదో పెద్దపాండిత్యమన్నట్టు ఇలా బయలుదేర వద్దని," అంటున్నది భార్య నిష్ఠూరంగా.

ఆ మాటలకు భర్త కోపం తెచ్చుకోకుండా, నవ్వుతూనే, 'నేనూ నీకు చెబుతూనే ఉన్నాను. కథల విలువ ఎవరికి తెలిసినా తెలియకపోయినా, మహారాజు కృష్ణభూపతికి తప్పక తెలుస్తుందని. చెప్పవలసిన విషయాన్ని

లక్ష్మీగాయత్రి



చెప్పవలసిన రీతిలో కథగా మలిచి చెబితే, అది అద్భుతమైన ఫలితాన్ని సాధిస్తుంది. అందుకు పంచతంత్ర కథలే తార్కాణం! నేనా రీతిలో కథ చెప్పగలనన్న విశ్వాసం నాకు ఉన్నది. నీరసపడిపోకుండా రాజదర్శనం కోసం ప్రయత్నించగల పట్టుదలా అధికం గానే ఉన్నది. ఈ రెండూ ఉంటే సాధించ లేనిది లేదు. కావాలంటే అందుకు ఉదాహర ణగా నాలాగే రాజదర్శనం కోసం వచ్చిన ఒక క్షురకుడి కథ చెబుతాను, విను,'' అంటూ కథ చెప్పడం ప్రారంభించాడు. కథకుడి మాటలు రాజు కృష్ణభూపతిలో కుతూహ లాన్ని పెంచాయి. ఆయనకథకుడిఇల్లాలికంటే ఆసక్తిగా చెవులు రిక్కించి కథ వినసాగాడు:

ఒకప్పుడు గౌడదేశంలోని ఒకానొకపల్లెలో సుందరుడు అనే క్షురక యువకుడు ఉండే వాడు. అతడు తక్కిన క్షురకుల్లా ఏదో మొక్కుబడిగా పనిచేసేవాడు కాదు. తన ఎదుట కూర్చున్న వ్యక్తి ముఖంతీరును బట్టి, ఒక శిల్పి శిల్పాన్ని చెక్కుతున్నంత శ్రద్ధగా అతడి తలకట్టును తీర్చిదిద్దేవాడు. వాడిచేత క్షురకర్మ చేయించుకున్నవారి ముఖాల్లో కొత్త అందాలు కనిపించేవి. ఇలా వాడు అందరినీ సుందరంగా తీర్చిదిద్దడం వల్ల, వాళ్ళందరూ వాణ్ణి 'సుందరుడు' అని పిలవసాగారు.

అందరూ తనను మెచ్చుకుంటూవుంటే, సుందరుడిలో చిన్న కోరిక మొలకెత్తి క్రమేణా ప్రగాఢవాంఛగా మారింది. రాజధానికి వెళ్ళి, రాజుగారి తలకట్టును తీర్చిదిద్దాలనీ, ఆయన నుంచి ప్రశంసలు పొందాలనీ కలలు కన సాగాడు. తనపనిలో ఆత్మవిశ్వాసం మెండుగా గల సుందరుడు తన కలను వాస్తవం చేసుకో వాలని నిర్ణయించుకుని, ఒకనాడు సకుటుం బంగా రాజధానికి బయలుదేరాడు.

వెళ్ళాడన్న మాటేగాని, రాజధానిలో సుందరుడి కోరిక అంత సులువుగా తీరేట్టు కనిపించలేదు. ''నేను రాజుగారికి క్షురకర్మ అందంగా చేస్తాను. నన్నొక్కసారి ఆయన దగ్గరకు వెళ్ళనివ్వండి,'' అంటూ సుందరుడు చెప్పిన మాటలు విని, వాణ్ణి భటులు పిచ్చి వాణ్ణి చూసినట్టు చూశారు. కొందరు నెమ్మ దిగా పొమ్మని చెబితే, మరి కొందరు మెడబట్టి గెంటేశారు. ఎన్ని సార్లు ప్రయత్నించినా, ఇలాంటి అనుభవమే ఎదురుకావడంతో వాడు నిరుత్సాహపడుతూన్న సమయంలో ఒక భటుడు, ''అయినా, మహారాజుగారి

క్షురకర్మ చేయడానికి గురన్న ఉండగా నీ అవసరం ఏమిటి?'' అని అడిగాడు.

''గురన్నా? అతడి ఇల్లు ఎక్కడ?'' అని అడిగాడు సుందరుడు.

''జామతోట పక్కన పడమటి వీధిలో ఉంది. అతడు క్షురకర్మలో చాలా నిపుణుడు,'' అన్నాడు భటుడు.

సుందరుడు రాజుగారి వాడుక క్షురకుడైన గురన్న వివరాలు సేకరించాడు. అరవైయేళ్ళ గురన్నకు పిల్లా పాపా లేరు. చాలా మంచి వాడు. సుందరుడు భార్యకు విషయం చెప్పి, ఆమె ఎలా సహకరించాలో వివరించి, ఉత్సాహంతో సకుటుంబంగా గురన్న ఇంటికి వెళ్ళాడు.

గురన్న ఆరుబయట జామచెట్టుకింది తిన్నె మీద కూర్చుని ఉన్నాడు. అతడి భార్య పక్కనే వున్న అరుగు మీద కూర్చుని రాత్రి వంటకు కూరగాయలు తరుక్కుంటున్నది. సుందరుడు, ''ఏం బాబాయ్, ఎలా ఉన్నావు?'' అని పలకరిస్తూ గురన్న పక్కన కూర్చున్నాడు. వాడి భార్య, గురన్న పెళ్ళాన్ని సమీపిస్తూ, ''అయ్యో! కూరలు కూడా నువ్వే తరుక్కోవాలా, అత్తా! ఏదీ, కత్తిపీట ఇలా తే!'' అంటూ చనువుగా ఆమె దగ్గరినుంచి, కత్తిపీట లాక్కుని చకచకా కూరగాయలు తరగసాగింది.

అనుకోని అతిథుల్లా వచ్చిన ఈ కొడుకు-కోడలు ఎవరా అని గురన్న దంపతులు ఆశ్చర్యపోతూండగానే, సుందరుడి నాలుగేళ్ళ కొడుకు, అక్కడున్న జామ చెట్టుకు వేలాడుతున్న కాయలను చూసి, తనకు జామకాయ కావాలని యేడ్వసాగాడు.



''ష్, వస్తూనే అలా గొడవ చేయొద్దు. ఆ చెట్టు మనది కాదు,'' అంటూ సుందరుడు కొడుకును మందలించబోయాడు.

కాని పసివాడు వినకుండా, ''మరెవరిది? ఈ తాతదా?'' అంటూ అనుమతి కోసమన్నట్టు నవ్వుతూ గురన్నవైపు చూశాడు.

పిల్లాపాపా లేని గురన్న దంపతులకు సుందరుడు, పెళ్ళాం కలిపిన వరసలకంటే, పసివాడి 'తాత' పిలుపు చెప్పలేనంత ఆనందాన్నిచ్చింది. మరి కాసేపటికల్లా సుందరుడి మంచితనం గురన్ననీ, వాడి భార్య మాట తీరు, పనితనం అతడి భార్యనూ ఎంతగానో ఆకట్టుకున్నాయి.

ఆ తరవాత సుందరుడి పని సానుకూల పడటం అంతకష్టం కాలేదు. గురన్న వారసుడిగా కొలువులో ప్రవేశించిన సుందరుడు, వారం తిరక్కుండా రాజును కూడా తన నైపుణ్యంతో ఆకట్టుకున్నాడు. సుందరుడూ, వాడి భార్యా గురన్న దంపతులను కడదాకా కన్నబిడ్డల్లాగే చూసుకుని పదిమంది చేతా భేష్ అనిపించుకున్నారు.

కథ పూర్తి చేసిన కథకుడు, ''చూశావా, చదువూ సంధ్యాలేని క్షురకుడే అయినప్పటికీ, ఆత్మవిశ్వాసం, పట్టుదలా ఉన్నకారణంగా సుందరుడు పిన్న వయసులోనే వృద్ధిలోకి వచ్చాడు. నాకూ ఆ రెండూ ఉన్నాయని ముందే చెప్పాను కదా! అందువల్ల సుందరుడికిలాగే నాకూ దైవకృప తోడయితే, రాజదర్శనం లభిస్తుంది,'' అంటూ కృష్ణభూపతి వైపు తిరిగి, ఆయన్ను భార్యకు చూపుతూ, ''ఎక్కడి దాకానో ఎందుకు? ఇదిగో ఈయన కూడా నీతో పాటు నా కథ వినే ఉంటారు. దేవుడి దయ ఉంటే, ఈయనే మహారాజుగారికి నా గురించి చెప్పవచ్చు,'' అన్నాడు.

అప్పటిదాకా ఆసక్తిగా కథ విన్న రాజు కృష్ణభూపతి, కథకుడి ఆఖరి మాటలు వింటూనే, అతడికి తను రాజేమోనన్న అనుమానం కలిగిందని గ్రహించాడు. వెంటనే, తలపాగా తీసి పక్కన పెడుతూ, ''అంతేనా... దేవుడి దయ ఉంటే నేనే కృష్ణభూపతినై మీ కథలకు పట్టం కట్టినా కట్టవచ్చు!'' అంటూ మందహాసం చేశాడు.



# బెత్తం స్వాములు

పాటలాద్రి బెత్తం స్వాముల చేత బెత్తం దెబ్బలు తిన్నవారిని అదృష్టం వరిస్తుందని ప్రతీతి. ఇందులోని రహస్యమేమిటో తెలుసుకోవాలని నాగరాజు అనే యువకుడు స్వాముల ఆశ్రమంలో చేరి ఆయన చెప్పిన పనులన్నీ ఓపిగ్గా చేయసాగాడు.

కొన్నాళ్ళు గడిచాక ఒకనాడు నాగరాజు కిందికి వాలుగా ఉన్న మామిడి చెట్టు నుంచి పళ్ళు కోస్తుండగా వీపు మీద ఠపీమని బెత్తం దెబ్బ తగిలింది. భరించరాని నొప్పి. నాగరాజు తిరిగి చూశాడు. కొట్టిన గురువు మాట్లాడకుండా వెళ్ళిపోతున్నాడు. మూడు రోజులు గడిచాక నాగరాజు కూరగాయల పాదుల్లో పని చేస్తూండగా ఎవరో వస్తున్నట్టు గమనించి తిరిగి చూసేలోపల స్వాములు బెత్తంతో కొట్టి వెళ్ళిపోయాడు. ఐదో రోజు పువ్వులు సేకరిస్తూండగా అక్కడికి వచ్చిన స్వాములు కొట్టడానికి బెత్తాన్ని ఎత్తగానే, నాగరాజు తిరిగి చూడ్డంతో కొట్టకుండానే వెళ్ళిపోయాడు. ఆ తరవాత స్వాములు కొట్టడానికి ప్రయత్నించినప్పుడల్లా నాగరాజు చూసి నమస్కరించడంతో, ఒక్క దెబ్బకూడా పడలేదు. సంతసించిన స్వాములు, ''నాయనా, నువ్వు పట్టిందల్లా బంగారమవుతుంది. ఇక నువ్వు వెళ్ళవచ్చు,'' అన్నాడు.

''అదెలా సాధ్యం?'' అన్నట్టు చూసిన నాగరాజు అనుమానాన్ని గ్రహించిన స్వాములు, ''మెలకువ ఉన్న మనిషికి లోటు అన్నది రాదు. అది ఇప్పుడు నీలో పరిపూర్ణంగా అభివృద్ధి చెందింది. తనను తాను అర్థం చేసుకుని, పరిసరాల స్పృహతో రానున్న కాలం ఎలా ఉండ గలదో గమనించగల వ్యక్తి దానికి అనుగుణంగా తనను తాను మార్చుకుంటాడు. అందువల్ల కాలం అతనికి విజయఫలాలనే అందిస్తుంది,'' అని ఆశీర్వదించాడు మందహాసంతో.

-మంజుభారతి






# రాకాసిలోయ

# 32

[మొసళ్ళ మడుగు వద్ద కేశవుడూ అతడి అనుచరులను బిడాలీ, శ్వానకర్ణీ రక్షించారు. ఆ తరవాత కేశవుడు మిత్రులిద్దరితో కలిసి, రాకాసిలోయలోకి ప్రవేశించాలని, గుహావాసుల సాయం ద్వారా కొండశిఖరం మీది నుంచి ఒకానొక లోయలోకి దిగాడు. అక్కడ వాళ్ళకు భయంకరపక్షి నొకదాన్ని చేత బట్టుకుని డప్పుల మోతకు అనుగుణంగా గంతులు వేస్తున్న గణాచారిలాటి వాడొకడు కనిపించాడు. -తరవాత]

లోయలోకి దిగుతూనే తమకు ప్రత్యక్షమైన ఈ వింత దృశ్యం చూసి కేశవుడూ, అతడి అనుచరులూ ఆశ్చర్యపోయారు. జయమల్లు ఎవరికీ కనబడకుండా వుండేందుకు, దాపుల నున్న ఒక మహావృక్షం ఎక్కాడు. ఆ వెంటనే కేశవుడూ, కోయగోమాంగ్ కూడా చెట్టు మీదికి పాకారు.

''వీళ్ళేదో నరమాంస భక్షకుల్లా కనబడుతు న్నారు. ఆ గండభేరుండ పక్షిని చేత బట్టుకుని చిందులు తొక్కేవాడు, వాళ్ళ నాయకుడై ఉంటాడు. మళ్ళీ మనం చిక్కుల్లో పడలేదు గదా!'' అన్నాడు జయమల్లు.

జయమల్లు మాటలకు కేశవుడేదో జవాబు చెప్పబోయేంతలో, గణాచారిలా గంతులు వేస్తున్న వాడు తన అనుచరుల కేసి తిరిగి, పెద్దగా గొంతెత్తి, ''మన కష్టాలన్నిటికీ కారణం, శత్రువులు మన గండభేరుండ పక్షి మాతల్ని సంహరించటమే. ఆ పక్షిమాతల్ని మనం కాపాడామో, ఆ మాతలు మనను కాపాడు తవి. గండభేరుండ పక్షి మాతల్ని రక్షించే

'చందమామ'



పోతున్నారన్న మాట,'' అన్నాడు జయమల్లు తలపంకిస్తూ.

''మనం ఈ గణాచారిగాడి అనుచరుల కంటబడితే, మననూ రెక్కల మనుషుల కింద జమకట్టి హత మార్చేందుకు ప్రయత్నిస్తారు,'' అన్నాడు కేశవుడు.

''మనకు అడుగడుగునా అవాంతరాలే. వీళ్ళను తప్పుకుని కొండల్లోని ఆ సొరంగ మార్గం తెలుసుకోవటం ఎలా?'' అని ప్రశ్నించాడు కోయగోమాంగ్.

ఈ విధంగా చెట్టుకొమ్మల్లో దాగి వున్న ఆ ముగ్గురూ ఆలోచిస్తున్నంతలో గణాచారి తన కొద్దిమంది అనుచరుల్ని వెంట బెట్టుకుని వేగంగా వెళ్ళిపోయాడు. కేశవుడూ వాళ్ళు మరికొంతసేపు కొమ్మల్లోనే వుండి, మెల్లిగా చెట్టు దిగి వచ్చారు.

''ప్రస్తుతానికి ఆ గణాచారిముఠా భయం లేదు. కాబట్టి బిడాలీ, శ్వానకర్ణీ చెప్పిన ఆ సొరంగ మార్గమేదో తెలుసుకుంటే రాకాసి లోయకు చేరవచ్చుగదా,'' అన్నాడు కోయ గోమాంగ్.

ఆ మాటలకు జయమల్లు నవ్వి, ''ఇన్ని కొండలూ, గుట్టలూ వున్న ఈ ప్రదేశంలో మనకు కావలసిన సొరంగమార్గం వెతకటం అంత తేలికకాదు. మనం ముందు ఈ లోయలో నివసించే వాళ్ళ కంటబడకుండా ఎంతో మెలకువతో వుండాలి. అది చాలా ముఖ్యం,'' అన్నాడు.

కేశవుడు నిశ్శబ్దంగా చెట్లచాటున నడుస్తూ అల్లంత దూరంలో వున్న కొండల కేసి చేయి

సాహసం మీలో ఎవరికైనా వున్నదా?'' అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు జవాబుగా అతడి అనుచరులు ఈటెలు పైకెత్తి, ''గండభేరుండాల్ని పట్టు కుని, వాటి రెక్కలు నరికి ఎత్తుకు పోతున్న వాళ్ళెవరో మాకు తెలుసు. ఈనాటి నుంచి ఆ దుర్మార్గుల్ని ఈ ప్రాంతాల అడుగు పెట్టకుండా చేయగలం. ఇదే మా ప్రతిజ్ఞ!'' అన్నారు.

''అలా అయితే, ఇకవెళ్ళండి. రాత్రనక పగలనక, ఆ పక్షి మాతలు నివసించే లోయ ప్రాంతాలను శత్రువుల నుంచి కాపాడండి,'' అంటూ గణాచారి తన చేతిలో వున్న గండ భేరుండపక్షిని వదిలేశాడు.

''ఇదీ సంగతి! పులుగురాయుడి ముఠా వాళ్ళు ఈ ప్రాంతాల వున్న గండభేరుండ పక్షుల్ని పట్టుకుని, వాటి రెక్కలు నరుక్కు

చూపి, ''మనం ఆ ప్రాంతాలకు ఏ ప్రమాదం లేకుండా చేరగలిగితే, ఆ తరవాత ఆ సొరంగ మేదో కనుక్కోవచ్చు,'' అన్నాడు.

ఆ తరవాత ముగ్గురూ కొంతదూరం నడిచి ఒక కొండప్రాంతాన్ని సమీపించారు. ఆ కొండ ఎగుడు దిగుడుగా వున్న పెద్ద పెద్ద బండ రాళ్ళతో నిర్జనంగా కనిపించింది. కేశవుడూ వాళ్ళు చెట్ల చాటు నుంచి బయిటికి వచ్చి, కొండను సమీపించబోయారు.

హఠాత్తుగా వాళ్ళకు ఎదురుగా వున్న ఒక ఎత్తయిన ప్రదేశం నుంచి కేకలు వినిపించినై. ముగ్గురూ తలలు ఎత్తి అటుకేసి చూశారు. నలుగు రైదుగురు అడవి మనుషులు వాళ్ళ కేసి ఈటెలు ఊపుతూ, ''ఎవరు మీరు? వెనక్కు తిరిగిపొండి. ఒక్క అడుగు ముందుకు వేశారో ప్రాణాలు దక్కవు. గండభేరుండాల రెక్కలు నరుక్కుపోయే మీ దుర్మార్గం ఇక సాగదు,'' అని పెద్దగా అరిచారు.

వాళ్ళకు జవాబుగా జయమల్లు, 'మేము గండభేరుండపక్షుల రెక్కలు నరుక్కుపోయేం దుకు వచ్చిన వాళ్ళం కాదు. మా దారిన మమ్మల్ని పోనివ్వండి,'' అని కేకవేశాడు.

జయమల్లు మాట ముగిసేలోపలే కొండ మీది నుంచి పెద్ద పెద్ద రాళ్ళు వేగంగా వచ్చి వాళ్ళు నిలబడిన చోట పడసాగినై. కోయ గోమాంగ్ రాళ్ళు విసిరే వాళ్ళతో ఏదో అన బోయేంతలో జయమల్లు అతడి భుజం పట్టుకుని వెనక్కు లాగుతూ, ''నువ్వేమి చెప్పినా, వాళ్ళ నుంచి నీకొచ్చే జవాబు రాళ్ళ వర్షం తప్ప మరేం వుండదు. నీ మాటలు



వాళ్ళు నమ్మరు. వెనక్కు తిరిగి వాళ్ళ దెబ్బకు అందకుండా పారిపోవటమే ప్రస్తుతానికి క్షేమం,'' అన్నాడు.

జయమల్లు వెనకగా కేశవుడూ అతణ్ణి అనుసరించి కోయగోమాంగ్ కొంతదూరం పరిగెత్తి, అక్కడ వున్న రాళ్ళవెనక కూచు న్నారు. గణాచారి అనుచరులు తమను వెన్నంటి వస్తున్నారేమో అన్న భయంతో, వాళ్ళ అలికిడి కోసం జాగ్రత్తగా కొద్ది సేపు విని, అలాంటిదేమీ లేకపోవటంతో ముగ్గురూ తృప్తిగా ఒక నిట్టూర్పు విడిచారు.

''మనం రాకాసిలోయను చేరేందుకు ఉపయోగపడే సొరంగమార్గం ఎక్కడ వున్నదో నాకు తెలిసిపోయింది,'' అన్నాడు జయ మల్లు. కేశవుడూ, గోమాంగ్ అతడి కేసి ఆశ్చ ర్యంగా చూశారు.



అంతా పుక్కిటిపురాణం ఎందుక్కాగూడదు?'' అన్నాడు జయమల్లు. ''అలా అయితే, మనం ఏ విధంగా అయినా గణాచారి అనుచరుల కనుగప్పి, వాళ్ళున్న కొండప్రాంతం చేరాలంటావు. అంతేనా, మల్లూ?'' అని అడిగాడు కేశవుడు.

జయమల్లు అవునన్నట్టు తలవూపి, ''మనం చీకటిపడ్డ తరవాత బయలుదేరటం మంచిది. అంతవరకు ఇక్కడే దాగి వుండి కాలక్షేపం చేద్దాం. ఇక్కడ శత్రుభయం ఉండదని నా నమ్మకం. ఆకలిగావున్నది. ఏదీ, మనం వెంట తెచ్చుకున్న ఆహారం బయిటికి తీయండి,'' అన్నాడు.

కోయగోమాంగ్ పెద్ద పెద్ద టేకు చెట్టు ఆకులలో కట్టివున్న ఆహారాన్ని కట్లువిప్పి జయమల్లూ, కేశవుడి ముందు పెట్టాడు. ఆ తరవాత ముగ్గురూ తృప్తిగా భుజించి సూర్యాస్తమయం అయ్యేవరకూ అక్కడే కాలం గడిపారు.

సూర్యాస్తమానం అయిన కొద్ది సేపటికి చంద్రోదయ మయింది. కేశవుడూ అతడి మిత్రబృందం కొండ ఎక్కేందుకు ప్రయాణమయ్యారు. జయమల్లు తన అనుచరుల కేసి తిరిగి, ''ఈ వెన్నెల మనకూ, గణాచారి ముఠా వాళ్ళకూ కూడా అనుకూలమైనదే. మనం ఈ ప్రాంతాలకు కొత్తగనక, దారిమార్గం వెతుక్కోవటానికి ఉపయోగంగా వుంటుంది. శత్రువులకు కూడా మన చర్యలు గుర్తించటం తేలిక. కనక, సాధ్యమైనంత వరకూ చెట్ల చాటున–చీకటిలో నడవండి,'' అన్నాడు.

జయమల్లు చిరునవ్వు నవ్వుతూ, ''ఆశ్చర్య పడకండి. రాకాసిలోయ అనేది ఈ కొండల వెనక ఎక్కడో వున్నదనిగదా, బిడాలీ, శ్వానకర్ణీ చెప్పింది. అంటే ఈ కనబడే కొండలు దానికి ఒక వైపున వున్న ఆనకట్టల్లాంటి వన్నమాట. వీటిని ఎక్కిచూస్తే లోయా, అవతల మరొక కొండల సోలుపూ కనబడితే, ఆ మధ్యనున్న లోయ, రాకాసిలోయ!'' అన్నాడు.

''అలా అయితే వాళ్ళు చెప్పిన 'ఒకానొక సొరంగం' మాటేమిటి?'' అని అడిగాడు కోయగోమాంగ్.

''ఒకానొక, అనటంలోనే ఆ బిడాలికీ, శ్వానకర్ణికీ ఈ ప్రాంతాల గురించిన వివరాలేవీ బాగా తెలియవని తెలిసిపోతున్నది. ఆ రాకాసిలోయకు వెళ్ళి తిరిగి వచ్చినవాడెవడూ లేడని వాళ్ళే చెప్పారుగనక, ఆ సొరంగం అదీ

ముగ్గురూ ఆ విధంగా చీకటి మాటున నడుస్తూ, కొండప్రాంతం కేసి కొంతదూరం వెళ్ళే సరికి, ఎదురుగా ఒక చెట్టుకింద నల్లని ఆకారం ఒకటి కదిలిన సవ్వడి వినిపించింది.

ఆ వెంటనే ముగ్గురూ అక్కడ గుబురుగా వున్న పొదల చాటున నక్కి కూచుని, ఆ ఆకారం కేసి పరీక్షగా చూశారు.

''ఒక్కడే ఒక్కడు! కొండ మీదికి వెళ్ళే మార్గాన్ని కాపలాకాచే గణాచారి అనుచరుడై వుంటాడు,'' అన్నాడు కోయగోమాంగ్.

''వీడు ఇక్కడ వుండగా మనం ముందుకు వెళ్ళటం అసంభవం. వీణ్ణి కాళ్ళూ చేతులూ కట్టి పడవెయ్యాలి,'' అన్నాడు కేశవుడు.

''అదేపాటి కష్టమయిన పని! నేను ఆ పక్కన వున్న పొదల్లోకి వెళ్ళి కొంచెం అలికిడి చేస్తాను. అదేమిటో చూసేందుకు వాడు బయలుదేరతాడు. మీరు వెనకనుంచి వాణ్ణి పట్టుకుని, అరవకుండా నోరు మూసి, కాళ్ళూ చేతులూ బిగించండి,'' అంటూ కోయ గోమాంగ్ వున్న చోటు నుంచి కదిలి, పిల్లిలా నక్కినక్కి నడుస్తూ పొదల చాటుకు వెళ్ళాడు.

కొద్దిసేపట్లో గోమాంగ్ వెళ్ళిన పొదల వెనక నుంచి చిన్నచిన్న ధ్వనులు బయలుదేరినై. ఆ వెంటనే గణాచారి అనుచరుడు ఈటెను పైకెత్తి, పొదలకేసి నడుస్తూ, ''ఏయ్, ఎవర క్కడ? బయిటికి రండి!'' అంటూ కేకపెట్టాడు.

వాడావిధంగా పొదలను సమీపించే లోపల కేశవుడూ, జయమల్లూ నీడల్లా నిశ్శబ్దంగా కదిలి, హఠాత్తుగా వెనక నుంచి వాడి మీద పడ్డారు. కేశవుడు కాపలావాడి చేతులు రెండూ



వెనక్కు విరిచి పట్టుకుని, కాళ్ళను తన కాళ్ళతో మెలివేశాడు. జయమల్లు వాడి నోటిని తన చేత్తో గట్టిగా మూసి, మెడను వెనక్కు వంచాడు. కాని, ఈ లోపల గణాచారి అనుచరుడు కీచుమంటూ పెద్దగా ఒక కేక పెట్టాడు. ఆ వెంటనే కొండ మీది నుంచి అరుపులు వినబడినై.

''ఇక వీణ్ణి ఆలస్యం కాకుండా కాళ్ళూ చేతులూ కట్టి, నోట్లో ఆకలములు కుక్కండి. వీడు పెట్టిన కేక, కొండ మీద వున్న వీడి మిత్రులు వినటం ఒక విధంగా మనకు ఉప యోగపడవచ్చు,'' అన్నాడు జయమల్లు.

క్షణాల మీద జయమల్లు వాళ్ళు తమ పని ముగించేలోగా అటువేపు నుంచి నలుగు రైదుగురు గణాచారి ముఠా వాళ్ళు పరిగె త్తుకు రావటం కనిపించింది.

''ఆ కొండ మీద కాపలావున్న వాళ్ళంతా తమ అనుచరుడి రక్షణకు ఇటు పరిగెత్తు కొస్తున్నారు. మనం ఏ ఆటంకం లేకుండా కొండ మీదికి చేరవచ్చు. వేగంగా పరిగె త్తండి!'' అంటూ కేశవుడు కొండ కేసి దౌడు తీశాడు.

కేశవుడు ఊహించినట్టు కొండ శిఖరం మీద శత్రువు లెవరూ లేరు. అతడు శిఖరం మీది నుంచి ఆవలి వైపుకు చూసి నిశ్చేష్టుడ య్యాడు. అతడికి అక్కడ వెడల్పయిన లోయా, వింత వృక్షాలూ, వాటి మీద పిశాచాల్లా రెక్కలు చాచుకు నిలబడి వున్న గండభేరుండాలూ కనిపించినై. ''ఇదే, రాకాసిలోయ!'' అన్నాడు కేశవుడు ఎంతో ఉత్సాహంగా.

''సందేహం లేదు. కాని, ఈ శిఖరం మీది నుంచి లోయలోకి ప్రవేశించటం ఎట్లా? నిట్టనిలువుగా వున్న ఈ రాళ్ళమీద ఎక్కడా కాస్త కాలు మోపేందుక్కూడా ఆస్కారం లేదే!'' అన్నాడు జయమల్లు నిరాశగా.

''ఇదుగో, ఇక్కడేవో అడవి లతల తీగలు వున్నవి. వీటి సాయంతో మనం లోయలోకి దిగవచ్చు,'' అన్నాడు కోయగోమాంగ్.

ఆ తీగలు తమ బరువును మోసేంత బలంగా వున్నవో లేవో పరీక్షించేందుకు జయ మల్లూ, కేశవుడూ వంగి వాటిని పట్టి చూస్తు న్నంతలో, వెనక నుంచి పెద్ద రణగొణ ధ్వని వినబడింది.

''చూడండి, ఆ దుర్మార్గులు ఇక్కడే వున్నారు. చుట్టుముట్టి ఈటెలతో పొడ వండి!'' అంటూ ఒకడు పెద్దగా అరిచాడు. ఆ వెంటనే అయిదారుగురు గణాచారి ముఠా వాళ్ళు పెడబొబ్బలు పెడుతూ శిఖరం పైకి రాసాగారు.

''ఈ అడవి తీగలు పట్టుకుని లోయలోకి దిగటం తప్ప మనకు మార్గాంతరం లేదు. ఊ, రండి!'' అంటూ జయమల్లు బలమైన తీగ నొకదాన్ని పట్టుకుని శిఖరం మీది నుంచి లోయలోకి దిగసాగాడు. కేశవుడూ, గోమాంగ్ అతణ్ణి అనుసరించారు.

''ఆ తీగ ఎక్కడున్నదో చూసి, రాళ్ళతో దాన్ని నజ్జునజ్జు చేయండి! ఆ ముగ్గురు దుర్మార్గులూ కింది లోయలో రాళ్ళ మీదపడి పచ్చడి అయిపోతారు,'' అని గణాచారి ముఠా వాడొకడు కేకపెట్టాడు. -(ఇంకావుంది)



# స్వార్థంలో నిస్వార్థం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, భయంకరమైన ఈ శ్మశానంలో నువ్వు స్వార్థం కోసం ఇలా కష్టపడుతున్నావో, లేక నిస్వార్థ చింతనతో ఇంతగా శ్రమపడుతున్నావో నాకు తెలియదు. అయితే, లోక వ్యవహారాలను నిశితంగా పరిశీలించి చూసినట్టయితే స్వార్థం కేంద్రబిందువు గానే మానవులందరూ ప్రవర్తిస్తున్నట్టు తెలుస్తుంది. నిస్వార్థం, పరార్థం, పరుల హితం ఇవన్నీ పైపై తొడుగులుగా, అమాయకులను మభ్యపెట్టడానికి నయవంచకులు వాడే మాటలుగా మాత్రమే కనిపిస్తాయి.

బేతాళ కథలు



ఇందుకు ఉదాహరణగా సజీవుడనే వైద్యుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

విరూపదేశంలోని రసపురమనే చిన్న పట్టణంలో ఉండే రత్నాంగుడనే వ్యాపారికి ముగ్గురు కొడుకులు. పెద్దవాళ్ళిద్దరికీ పెళ్ళిళ్ళై వ్యాపారంలో తండ్రికి చేదోడువాదోడుగా ఉంటున్నారు. చివరివాడు సజీవుడికి ఇరవై ఏళ్ళొచ్చినా వ్యాపారమంటే ఆసక్తిలేదు సరికదా-అడిగిన వారికి లేదనకుండా ధనసాయం చేసేదయాగుణం ఉంది. పిన్నలూ, పెద్దలూ అందరూ అతడితో స్నేహంచేసి నాలుగు మంచి మాటలు చెప్పి డబ్బడిగి తీసుకువెళ్ళేవారు. అది ఇంట్లో ఎవరికీ నచ్చేదికాదు.

కొడుకునెలా మార్చాలా అని రత్నాంగుడు దిగులు పడితే, పెళ్ళి చేస్తే మార్పురావచ్చునని భార్య చెప్పింది. విషయం తెలిసిన రత్నాంగుడి స్నేహితుడొకడు, ''సజీవుడిది జాలిగుండే కాని లోకజ్ఞానం లేదు. నా కూతురు మనోరమకు జాలిగుండె, లోకజ్ఞానంతో పాటు మంచి తెలివితేటలు కూడా ఉన్నాయి. ఆమెతో పెళ్ళి జరిపిస్తే మీవాణ్ణి దారిలో పెడుతుంది,'' అన్నాడు.

ఆ విధంగా త్వరలోనే మనోరమ సజీవుడి భార్య అయింది. తండ్రి మాటలు నిజం చేస్తూ ఆమెపెళ్ళయిన కొన్ని రోజులకే భర్తను కొంగున ముడేసుకుంది. ఒక రోజున భర్తతో, ''నువ్వు మంచి మనసుతో దానాలు చేస్తున్నా, అవి పుచ్చుకున్నవారిలో ఒక్కరు కూడా సంతోషంగా లేరని ఇంట్లో అంతా అంటున్నారు. అది నిజం కాదని రుజువు చెయ్యి. లేదా నీ పద్ధతి మార్చుకుని ఇంట్లోవారిని సంతోషపరుచు,'' అన్నదామె.

సజీవుడది సవాలుగా తీసుకుని, ముందుగా సంజయుడింటికి వెళ్ళాడు. అప్పుడు సంజయుడు తన ఇంటి అరుగు మీద దిగులుగా కూర్చుని ఉన్నాడు. సజీవుణ్ణి చూడగానే, ''నువ్విచ్చిన డబ్బుతో చాలా కాలం తరవాత నిన్ననే మా ఇంట్లో పిండి వంటలు చేసుకున్నాం. మేమంతా బావున్నాం కాని మితిమీరి తిన్న మా నాన్నకూ, నా చిన్న కొడుక్కూ అజీర్ణం చేసింది. వైద్యుడు మందిస్తే అబ్బాయికి నయమయింది కాని, నాన్నకింకా తగ్గలేదని మూడు రోజులు కటికలంఖణాలు చేయమన్నాడు వైద్యుడు. నాన్న ఉక్రోషంతో డబ్బిచ్చిన నిన్నూ, పిండి వంటలు చేయించిన



నన్నూ నోటి కొచ్చినట్టు తిడుతున్నాడు,'' అన్నాడు దీనంగా.

ఇంట్లో వాళ్ళ మాట నిజమయిందని నిరుత్సాహపడినా, అందరి విషయంలోనూ అలాగే జరగదన్న నమ్మకంతో, సజీవుడు అక్కడి నుంచి సుగ్రీవుడింటికి బయలుదేరాడు. గుమ్మంలోనే ఆ ఇంటివాళ్ళ తిట్లు వినిపించాయి. జరిగిందేమిటంటే-కూతురికీవేళ పెళ్ళిచూపులని నిన్ననే సుగ్రీవుడతణ్ణి నూరు వరహాలడిగి పట్టుకెళ్ళాడు. ఈ రోజు అతడి కూతురికి ఒళ్ళెరుగని జ్వరం వచ్చింది. చూడ్డానికి వచ్చిన మగపెళ్ళివారు పిల్లరోగిష్టిదని చిరాకు పడి వెళ్ళిపోయారు. సంబంధం మంచిదనీ, సజీవుడి డబ్బు అందిన వేళ అచ్చిరాకనే అది తమకు కాకుండా పోయిందనీ ఇంట్లోవాళ్ళు తిట్టుకుంటున్నారు.

వెనక్కు తిరిగిన సజీవుడు మరో నాలుగిళ్ళకు వెళితే అన్ని చోట్లా అదే పరిస్థితి. ఏకారణంవల్లనైతేనేం, తన సాయం పొందిన వారెవ్వరూ సంతోషంగా లేరని గ్రహించి సజీవుడు ఇంటికి వెళ్ళి జరిగింది భార్యకు చెప్పి, ''స్నేహితులను సంతోషంగా ఉంచడానికి నాది సరైన పద్ధతి కాకపోతేనేం? నావల్ల వారి అవసరాలు తీరుతున్నాయి. అంతకంటే మంచి పద్ధతి ఉంటే చెప్పమను. తప్పక అనుసరిస్తాను,'' అన్నాడు.

మనోరమ వెంటనే, ''అయితే నేను చెప్పినట్టు చెయ్. మనిషికి నిజమైన సంతోషాన్నిచ్చేది ఆరోగ్యం. ఆరోగ్యం లేనివాడికి ఎన్ని సంపదలున్నా సంతోషముండదు. నీ స్నేహితులకూ, తెలిసినవారికీ నిజమైన సుఖసంతోషాలివ్వాలనుకుంటే నువ్వు వైద్యం నేర్చుకో. ఉన్నవారివద్ద డబ్బు తీసుకో. లేనివారికి ఉచితంగా వైద్యం చెయ్,'' అన్నది.

''వైద్యం నేర్చుకోవడానికి చాలా ఏళ్ళు పడుతుందికదా?'' అన్నాడు సజీవుడు.

''బృహదరణ్యంలో ఆసవుడనే తపస్వి అర్హతగల శిష్యుడికి ఒక్క సంవత్సరంలోవైద్యం నేర్పగలడట. నువ్వు అక్కడికి వెళితే తొందరగా వైద్యుడివికాగలవు,'' అన్నది మనోరమ.

సజీవుడు అప్పటికప్పుడే బయలుదేరి బృహదరణ్యానికి వెళ్ళి ఆసవుణ్ణి కలుసుకున్నాడు. ఆయన అతణ్ణి శిష్యుడిగా స్వీకరించి ఏడాదిలో వైద్యశాస్త్ర పారంగతుణ్ణి చేశాడు. విద్యాభ్యాసం పూర్తయ్యాక ఆసవుడతడితో, ''వైద్యశాస్త్రంలో ప్రపంచంలో ఏ వైద్యుడికీ



తెలియని చికిత్సావిధానాలు నీకు నేర్పాను. కానీ, మందులకులొంగని జబ్బులింకా కొన్ని ఉన్నాయి. వాటిని నయం చేయగల మంత్రాలను రూపొందించి గ్రంథస్థం చేశాను. సేవా దీక్షతో నిస్వార్థంగా వైద్యం చేసేవాడికే ఆ గ్రంథాన్ని పొందే అర్హత ఉంటుంది. నీకా గ్రంథం పొందే అర్హత ఉన్నదని నా నమ్మకం. అది రుజువైనప్పుడు నీకు ఎవరో ఒకరు నా పిలుపు అందజేస్తారు. అప్పుడు వచ్చావంటే ఆ గ్రంథాన్ని ఇస్తాను,'' అన్నాడు.

సజీవుడు గురువుకు పాదాభివందనం చేసి, రసపురానికి తిరిగి వచ్చి జరిగింది భార్యకు చెప్పాడు. ఆమె చెప్పిన ప్రకారం పేదలకు ఉచితంగానూ, కలిగినవారికి హెచ్చుమొత్తం తీసుకుంటూనూ వైద్యం చేయసాగాడు.

ఒకసారి ఒక సాధువు సజీవుడి ఇంటి ముందు, ''భిక్షాందేహి'', అనబోయి సజీవుడొక పేదరోగిని శ్రద్ధగా పరీక్షించడం గమనించి ఆగాడు. అంతలో ఆ ఇంటి ముందు ఆగిన గుర్రపు బగ్గీలోంచి దిగిన ఒక భాగ్యవంతుడు సజీవుడి వద్దకు వెళ్ళి, ''వైద్యోత్తమా, తమరు కోరిన ధనమిస్తాను. ముందు నన్ను పరీక్షించండి,'' అన్నాడు దర్పంగా.

సజీవుడాయన్ను ఒకసారి తేరిపారజూసి, ''కోరిన ధనమివ్వగలిగితే తప్పక తీసుకుంటానుగానీ, చికిత్సకు ముందు వెనకలు డబ్బుతో కాక, రోగాన్ని బట్టి నిర్ణయించాలి. నీదంత ప్రమాదకరమైన జబ్బు కాదని చూడగానే తెలిసింది. నీవంతు రాగానే నిన్ను నేనే పిలుస్తాను. అంతవరకు ఆ పక్కనే కూర్చో,'' అన్నాడు.

భాగ్యవంతుడు వెళ్ళి అరుగు మీద కూర్చుంటూండగా, సజీవుడి దృష్టి ఇంటి ముందు నిలబడ్డ సాధువు మీద పడింది. అతడు సాధువుకు నమస్కరించి, ''తమరీ పూట మా ఇంట భోజనం చేసి మమ్మల్ని అనుగ్రహించండి,'' అన్నాడు.

సాధువు చిరునవ్వు నవ్వి, ''పనిముగించుకుని లోపలకురా. ఇద్దరం కలిసి భోంచేద్దాం,'' అంటూ ఇంట్లోకి వెళ్ళాడు.

సజీవుడు అక్కడున్న రోగులను పరీక్షించి, మందిచ్చి పంపి లోపలకు వెళ్ళేసరికి బాగా ఆలస్యమయింది. అతడు క్షమాపణ కోరితే సాధువు, ''నీలా రోగులపట్ల శ్రద్ధ, డబ్బుకు లొంగని నిస్వార్థం, సాధుజనుల పట్ల ఔదార్యం గల వైద్యులు అరుదు. ఆసవుడి వైద్యమంత్ర

గ్రంథం అందుకునే అర్హత నీకున్నది. వెంటనే బృహదరణ్యానికి వెళ్ళు,'' అన్నాడు.

ఆయన్ను ఆసవుడే పంపాడని గ్రహించిన సజీవుడు భార్యకు విషయం చెప్పాడు. ఆమె, ''బృహదరణ్యానికి వెళ్ళిరావడానికి పట్టే వారం రోజులూ రసపురంలో నీ మీద ఆధార పడ్డ రోగులకు ఇబ్బంది అవుతుంది. రోగులు లేని సమయంలో గురువర్యులను కలుసు కోవడం మంచిది,'' అన్నది.

ఆ మాటలే సజీవుడు సాధువుకు చెప్పాడు. ఆయన సరేనని భోజనం చేసి వెళ్ళిపోయాడు.

ఇలా ఉండగా ఆ దేశపు రాజు భీమసేనుడి తల్లికి భరించలేని తలనొప్పి వస్తే రాజవైద్యుడి మందులేమీ పనిచేయలేదు. రాజమాతకు నయం చేస్తే కనకాభిషేకం చేస్తానంటూ సజీవుడి కోసం దూతను పంపాడు రాజు. భార్య సలహా మీద సజీవుడా దూతతో వినయంగా, ''నేను కదిలితే ఇక్కడ ఎందరో రోగులకు ఇబ్బంది. ప్రజాహితం కోరే మన రాజది హర్షించరు. చికిత్సకు రాజమాతే ఇక్కడికి రావడం మంచిది,'' అని చెప్పిపంపాడు.

ఆ మరునాడు సాధువతణ్ణి కలుసుకుని అతడి ధైర్యాన్నీ, నిస్వార్థపరత్వాన్నీ మెచ్చుకుని బృహదరణ్యానికి వెళ్ళి ఆసవుడి వైద్య మంత్ర గ్రంథాన్ని తెచ్చుకోమన్నాడు. కాని సజీవుడు పూర్వంలాగే బదులిచ్చాడు.

మరికొన్నాళ్ళకు రసపురంలోకెల్లా భాగ్యవంతుడైన మహేంద్రుడికి పెద్ద జబ్బు చేసింది. సజీవుడికా రోగలక్షణాలు అంతుబట్టక తికమక పడుతున్న సమయంలో సాధువు మనో



రమను కలుసుకుని, ''మహేంద్రుడి జబ్బుకు మంత్రాలే పనిచేస్తాయి. ఇకనైనా నీ భర్తను బృహదరణ్యానికి పంపు,'' అన్నాడు.

మనోరమ సరేనని భర్తను వెంటనే బృహదరణ్యానికి వెళ్ళి రమ్మన్నది. కాని సజీవుడు అందుకు అంగీకరించలేదు. అప్పుడు మనోరమ సాధువు సలహాపై, తనకూ ఏదో వింత జబ్బు వచ్చినట్టు నటించింది. తానేమందిచ్చినా భార్యకు పనిచేయడం లేదన్న దిగులుతో సజీవుడు తన వద్దకు వచ్చే రోగులకు రోగనిదానం సరిగ్గా చేయలేక పోతుంటే సాధువతణ్ణి కలుసుకుని, ''ఇకనైనా వెళ్ళి ఆసవుడి వైద్య మంత్రగ్రంథం తెచ్చుకో. లేకుంటే నీ భార్య నీకు దక్కదు,'' అని హెచ్చరించాడు.

మనోరమ కూడా వెళ్ళిరమ్మని కోరడంతో సజీవుడు బృహదరణ్యానికి వెళ్ళి ఆసవుడి

వైద్య మంత్ర గ్రంథాన్ని స్వీకరించి తిరిగి వచ్చాడు. మహేంద్రుడితో పాటు ఎందరికో వైద్యసేవలు అందించి కృతార్థుడయ్యాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, సాధువు ఎంత చెప్పినా వెళ్ళడానికి నిరాకరించిన సజీవుడు భార్యకు జబ్బు చేయగానే ఆసవుడి వద్దకు వెళ్ళడం స్వార్థం కాదా? తమ వద్ద వైద్యమంత్రగ్రంథం వుంటే మహేంద్రుడు వంటి భాగ్యవంతులకు వైద్యం చేసి ధనం ఆర్జించవచ్చన్న ఆశతో వింత జబ్బు వచ్చినట్టు నటించి భర్తను బృహదరణ్యానికి వెళ్ళిరమ్మని భర్తను ప్రోత్సహించడం మనోరమ స్వార్థంకాక మరేమిటి? ఇలారెండు రకాల స్వార్థంతో వచ్చిన సజీవుడికి ఆసవుడు నిస్వార్థ పరులకు మాత్రమే ఇస్తానన్న వైద్యమంత్ర గ్రంథాన్ని ఇవ్వడం నియమభంగం కాదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''అగ్నిసాక్షిగా పెళ్ళాడిన భార్యను కాపాడవలసిన బాధ్యత భర్తగా సజీవుడికి ఉన్నది. ఆమె వైద్యంకోసం అతడు బృహదరణ్యానికి వెళ్ళడం స్వార్థం అనిపించుకోదు. సజీవుడు పేదసాదలకు వైద్యసేవలు అందించడానికి కారణం మనోరమ. అలాంటి ఆదర్శపత్నికి ధనాశ అనే స్వార్థం అంటగట్టడం సమంజసం కాదు. ఆమె అనారోగ్యం పాలయిందని తెలియగానే, ఇతర రోగులకు సరైన వైద్యం చేయలేక సజీవుడు అవస్థపడ్డాడు. అలాంటిది భార్య జబ్బుముదిరి మంచం పడితే, తట్టుకోలేక వైద్య వృత్తినే మానేసే అపాయం లేకపోలేదు. భార్యకోసమని తెచ్చిన వైద్యగ్రంథం మరెందరికో మెరుగైన వైద్యసేవలు అందించడానికి ఉపయోగ పడింది. అందువల్ల సజీవుడు బృహదరణ్యానికి వెళ్ళడం నిస్వార్థమే తప్ప, స్వార్థం అనిపించుకోదు. అతనికి వైద్యగ్రంథం ఇచ్చి ఆసవుడు నియమభంగం చేశాడనడానికి ఏమాత్రం తావు లేదు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : ''వసుంధర'' రచన]



## నాకు నచ్చిన కథ-10



మూడు దశాబ్దాలకు పైగా పిల్లల కోసం రచనలు చేస్తూన్న శ్రీమతి స్వప్నదత్త నలభైకి పైబడ్డ పుస్తకాలు రచించారు. ఆమె రచనలు చందమామతో సహా అన్ని ప్రముఖ పత్రికలలోనూ వెలువడ్డాయి. భారతదేశపు ఎనిడ్ బ్లైటన్‌గా కీర్తించబడే శ్రీమతి స్వప్నదత్త పుస్తకాలను చిల్డ్రన్స్ బుక్ ట్రస్ట్ కూడా ప్రచురించింది. ఆమె టార్గెట్‌లో ఎడిటోరియల్ కన్సల్టెంట్‌గా పనిచేశారు. లిమ్కా బుక్ ఆఫ్ రికార్డ్స్ అసిస్టెంట్ ఎడిటర్‌గానూ, 1987 నుంచి 2002 వరకు ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా డెప్యూటీ ఎడిటర్‌గానూ ఉన్నారు. నేషనల్ ఫెలోషిప్, నేషనల్ అవార్డ్, మునీచ్, వియన్నా ఇంటర్నేషనల్ యూత్ లైబ్రరీ స్కాలర్‌షిప్ మొదలైన ఎన్నో అవార్డులనూ, బహుమతులనూ అందుకున్న శ్రీమతి స్వప్నదత్త బెంగుళూరులో ఉంటున్నారు.

# కన్నీటి విలువ

*కన్నీళ్ళు ఎల్లప్పుడూ దుఃఖాన్ని మాత్రమే సూచిస్తాయా? కొన్ని సందర్భాల్లో ఆనందాన్ని కూడా సూచిస్తాయి. అందుకే ఆనందబాష్పాలు అంటాం. ఆ మాటకొస్తే కన్నీళ్ళు వెలువరించని భావోద్వేగాలు లేవు. కన్నీటి విలువను తెలియజేసే ఒక కథను మా బొమ్మ నాకు చిన్నప్పుడు చెప్పింది. మీకూ నచ్చగలదనే ఉద్దేశంతో ఆ కథను మీతో పంచుకోవడానికి ఆనందిస్తున్నాను.*

అది ఒక వసంతకాల ఉదయం. ఎక్కడ చూసినా విరబూసిన పసుపు, పచ్చ, ఎరుపు, నీలం, ఊదా అంటూ రంగురంగుల పువ్వులు. పక్షుల కిలకిలారావాలు. సెలయేళ్ళు కూడా పాడుతున్నాయి. ఎటు తిరిగినా ఆనందం తాండవిస్తున్నది.

రాజభవనంలోని మహారాణి మధురిమా దేవి అప్పుడే నిద్రలేచింది. గవాక్షం నుంచి వెలుపలికి చూసింది. రాజోద్యానంలోని రంగురంగుల పువ్వులు ఆమెకు కనులవిందు చేశాయి. వీనుల విందుగా కోయిలపాట, పక్షుల కిలకిలారావాలు వినిపించాయి. ఆమె హృదయం ఆనందంతో ఉప్పొంగింది.

అప్పుడే అక్కడికి వచ్చిన మహారాజుతో, ''ఈ రోజు మనం వనవిహారానికి వెళ్ళి అక్కడ వసంతోత్సవం జరుపుకుందామా?'' అన్నది రాణి మధురిమాదేవి ఉత్సాహంగా.

రాజు మందహాసం చేసి, ''నువ్వు చెలికత్తెలతో కలిసి వెళ్ళు. నేను సాయంకాలానికి వచ్చి కలుసుకుంటాను,'' అన్నాడు.

రాణి చెలికత్తెలతో కలిసి సమీపంలోని అడవిని చేరుకున్నది. అక్కడి సెలయేటిలో స్నానమాడింది. పువ్వులు కోసి మాలలు కట్టింది. సుమధుర ఫలాలను అందుకుని తిన్నది. చెలికత్తెలతో కలిసి సీతాకోక చిలుకలను పట్టుకోవడానికి పరుగులుతీస్తూ, పక్షులతో కలిసి

పాడుతూ రోజంతా సమయం గడవడం తెలియకుండా సంతోషంగా గడిపింది.

సాయంకాలమయింది. సూర్యాస్తమయంతో పక్షులన్నీ గూళ్ళకు చేరాయి. మెల్లమెల్లగా ఆకాశంలో తారలు మిలమిలా మెరవసాగాయి. అయితే, వస్తానని మాట ఇచ్చిన రాజు మాత్రం రాలేదు. చెప్పిన మాట మరిచి పోయాడా అని రాణి అనుమాన పడింది. ఆమె చెలికత్తెలతో కలిసి రాజభవనానికి తిరిగి వచ్చింది.

వచ్చీరాగానే రాజుకు అడవిలో చూసిన విశేషాల గురించి చెప్పాలని రాణి ఉబలాటపడింది. కాని రాజు అక్కడ లేడు. క్షణాలు నిమిషాలుగా, నిమిషాలు గంటలుగా గడిచిపోతున్నా రాజు జాడకనిపించలేదు. ఆకాశంలో చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. రాజభవనం సమీపంలోని రహదారులు నిర్మానుష్యంగా ఉన్నాయి. భవనంలో ఎలాంటి శబ్దమూ లేకుండా ప్రశాంత గంభీరంగా ఉన్నది. అప్పటికీ రాజు రాకపోయేసరికి రాణి అసహనం ఆగ్రహంగా మారసాగింది. అర్ధరాత్రి సమయంలో అక్కడికి వచ్చిన రాజును చూసి, ''ఇంత ఆలస్యానికి కారణం ఏమిటి ప్రభూ?'' అని అడిగింది రాణి.

''ప్రజల బాధలు, రాణీ!'' అన్నాడు రాజు.

''బాధలా?'' అంటూ ఆశ్చర్యపోయింది రాణి.

''అవును. సమస్యలను పరిష్కరించి వాళ్ళ బాధలు పోగొట్టడం, రాజుగా నా బాధ్యత కదా?'' అన్నాడు రాజు.

''అందమైన రోజును, బాధలు వింటూ వృధా చేశారా?'' అంటూ గాఢంగా నిట్టూర్చింది రాణి.

రాజు మరేమీ మాట్లాడకుండా చిన్నగా నవ్వి ఊరుకున్నాడు. మరునాడూ, ఆ మరుసటి రోజూ అలాగే జరిగింది. రాణి రోజంతా వనంలో గడిపినప్పటికీ రాజు అటుకేసి రాలేదు. దాంతో రాణికి అమితమైన ఆగ్రహం కలిగింది. సహనం కోల్పోయి, ''నీ రాజ్యంలో ఎందుకిన్ని బాధలు? వనాంతరాలలోని ప్రశాంతత ఇక్కడ మచ్చుకైనా కానరాదు. ఎక్కడ చూసినా ఏడుపులు,





పెడబొబ్బలు! నాకిది భరించ శక్యం కాలేదు. నేను సంతోషంగా ఉండాలి. ఎప్పుడూ నవ్వుతూ ఉండాలి. అందరూ నవ్వుతూ కనిపించాలి,'' అన్నది రాజుతో.

''అది సాధ్యం కాదు మధురిమా! మనం ఎంత ప్రయత్నించినా, జీవితం అన్నాక కష్టాలు తప్పవు. వెలుగు చీకట్లు, సుఖదుఃఖాలు, నవ్వులు ఏడుపులు-పడుగూ పేకల్లా కలగలిసి పోయి ఉంటాయి. మనుషులన్నాక రెండిం టినీ ఎదుర్కోవాలి, ఒకదానిని పూర్తిగా బహిష్క రించడం సాధ్యం కాదు,'' అన్నాడు రాజు.

''ప్రయత్నిస్తే సాధ్యం కానిదేదీ లేదు ప్రభూ! మీరు ఈ రాజ్యానికి రాజు. కన్నీళ్ళు కార్చే వాళ్ళను రాజ్యం నుంచి బహిష్కరిస్తామని ప్రకటిం చండి. ఆ తరవాత ఏడ్చే వాళ్ళంటూ ఒక్కరూ ఉండరు!'' అన్నది రాణి.

ఆ మాటకు దిగ్భ్రాంతి చెందిన రాజు, ''రాజ్యానికి రాణివైన నువ్వు ప్రజలకు తల్లి లాంటి దానివి. నీ మనసులో ఇలాంటి కఠోర మైన, అసంబద్ధమైన కోరిక ఎలా కలిగింది?'' అని అడిగాడు.

''ఇది నా కోరిక. నువ్వు నేను చెప్పినట్టు చెయ్యాలి. అంతే!'' అన్నది రాణి నిష్కర్షగా.

''చేస్తాను కాని, నీ నిర్ణయానికి నువ్వు త్వరలో పశ్చాత్తాప పడగలవు. ఆలోచించుకో!'' అని హెచ్చరించాడు రాజు.

ఆ మాటకు రాణి హేళనగా నవ్వి, అద్దంవైపు తిరిగి తన అందచందాలు చూసుకోసాగింది.

రాజుగారి చాటింపు విని ప్రజలు దిగ్భ్రాంతి చెందారు. తమ కన్నీళ్ళను సైతం దోచుకునే కఠినాత్ములెవరో తెలియక సతమతమయ్యారు? బాధలలో, కష్టనష్టాలలో, విషాదాలలో కన్నీరు కార్చకుండా ఎలా నవ్వగలరు? సంతోషాన్ని బలవంతంగా పుట్టించగలరా? మరు రోజునుంచే కన్నీళ్ళు కార్చడంతో రాజ్యబహిష్కారానికి గురయ్యేవారి సంఖ్య పెరగసాగింది!

రుతువుల కాలచక్రం తిరగడంతో సంవ త్సరం గడిచిపోయి మళ్ళీ వసంతం వచ్చింది. అరణ్యాలు నూతన శోభను సంతరించుకు న్నాయి. కోయిలలు పాడసాగాయి. అయితే వాటన్నిటినీ చూసి ఆనందించే స్థితిలో రాణి లేదు. ఎందుకంటే ఆమె ఒక్కగానొక్క బిడ్డకు తీవ్రంగా జబ్బు చేసింది. ఆవేదనతో రాణిగారి గుండె బరువెక్కింది. ఆస్థానవైద్యులే కాక రాజ్యం నలుమూలల నుంచి వైద్యులు వచ్చి చికిత్స చేసినప్పటికీ ఫలితం లేక ఒకనాడు వేకువ జామున యువరాజు శాశ్వతంగా కన్ను మూశాడు. రాణి మధురిమాదేవి కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. ఇక తన జీవితంలో

నవ్వు అన్నదే లేకుండా పోతుందేమో అన్న పరిస్థితి ఏర్పడింది.



మరునాడు రాజు రాణిని సభకు పిలిపించి, ''నీ ఆజ్ఞను నువ్వే అతిక్రమించావు. రాజ్య బహిష్కరణ శిక్షను నువ్వు అనుభవించాలి!'' అన్నాడు.

ఆ మాటకు రాణి నివ్వెరపోయింది. ''రాణినే బహిష్కరిస్తారా?'' అన్నది ఆవేశంతో.

''నీ ఆజ్ఞానుసారం చట్టం చేశాను. చట్టం ముందు అందరూ సమానులే. రాజ కుటుంబానికి సైతం అందులో మినహాయింపు ఉండదు,'' అన్నాడు రాజు గంభీరంగా.

అప్పటికప్పుడే రాణి అడవికి వెళ్ళక తప్ప లేదు. ఏ వన్యమృగాలకు ఆహారం కావలసి వస్తుందో కదా అని మౌనంగా విలపిస్తూ అడవి చేరిన ఆమెకు అక్కడ మనుషుల కంఠస్వరాలు వినిపించాయి. రాజ్యంనుంచి బహిష్కరించబడ్డ అభాగ్యులందరూ అక్కడే ఉన్నారు. వారు రాణిగారికి స్వాగతం పలికారు. ఆమె పుత్ర శోకంలో పాలుపంచుకున్నారు. ఓదార్చారు. ఆమెకని ప్రత్యేకంగా ఒక కుటీరం నిర్మించి ఇచ్చారు. ఆమెను తమలో ఒకరిగా భావించి ఆమె అవసరాలన్నీ సమకూర్చసాగారు.

రోజులు గడిచేకొద్దీ అడవిలోని ప్రజలు రాణి పట్ల గౌరవంతో పాటు ప్రేమను పెంచుకున్నారు. తమ కష్ట సుఖాలను ఆమెతో చెప్పుకోసాగారు. రాణి కూడా తన పాతవైభవాన్నంతా మరిచిపోయింది. ఆమెలోని అధికార దర్పం, అహంకారం మటుమాయమయ్యాయి. ప్రజలతో కలిసి పనిపాటులు చేయసాగింది. తనకు నూతన జీవితాన్ని ప్రసాదించిన అక్కడివారి పట్ల కృతజ్ఞత పెంచుకున్నది. ఆఖరికి ప్రజల బాగోగులు చూసుకునే నిజమైన రాణిగా తల్లి మనసును సంతరించుకున్నది.

ఒకనాటి ఉదయం వేళ రాజు బంగారు రథంలో వచ్చి అక్కడ దిగాడు. చుట్టుపక్కల కలయచూస్తే-రాణి ఆరోగ్యం బాగాలేని బిడ్డను ఆప్యాయంగా తడుతూ కనిపించింది. బిడ్డ రాణి చేతులను పట్టుకుని ఉన్నది. ఆమె కళ్ళ నిండా నీళ్ళు. రాజును చూడగానే ఆమె తల వంచి నమస్కరించింది.

''మధురిమా! కన్నీటి విలువ ఇప్పుడు తెలిసి వచ్చింది కదా?'' అని అడిగాడు రాజు మృదువుగా.

''తెలుసుకున్నాను, ప్రభూ!'' అన్నది రాణి వినయంగా.

''మరి ఇంకేం. బహిష్కరించబడ్డ ప్రజలందరితో పాటు, నువ్వావెంటనే రాజధానికి బయలుదేరవచ్చు కదా!'' అన్నాడు రాజు గంభీరంగా.

## మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (28)

# శాస్త్రవేత్త వాక్చాతుర్యం



సుప్రసిద్ధ భారతీయ విజ్ఞానశాస్త్రవేత్త సర్ సి.వి. రామన్ (1888-1970) పేరు వినగానే విదేశాలలోని మేధావులకు, శాస్త్రవేత్తలకు చాలా వింత గొలిపే ఆశ్చర్యాన్ని రేకెత్తించేది. ఎందుకంటే బ్రిటిష్ పాలనలో ఉన్న భారతదేశం ఏ రంగంలోగానీ చెప్పుకోతగ్గ ప్రగతిని సాధించజాలదని ఆ రోజుల్లో భావించేవారు. అయితే, కలకత్తా (కొల్‌కతా) విశ్వవిద్యాలయంలో భౌతిక శాస్త్ర ఉపన్యాసకులుగా పని చేసిన డా. చంద్రశేఖర వెంకటరామన్, వెలుగు కిరణాల మాలిక్యూలార్ నిర్మాణంలో సంవత్సరాల తరబడి పరిశోధనలు జరిపి, సరికొత్త 'ఆప్టికల్ ఎఫెక్ట్'ను కనుగొన్నాడు. ఆయన కనుగొన్న విషయాలు 1928వసం.లో ప్రచురించబడ్డాయి. ఆనాటి ప్రముఖ విజ్ఞాన శాస్త్ర వేత్తలకు ఈ పరిశోధనావ్యాసం విస్మయం కలిగించింది. ఈ థియరీని నిశితంగా పరీక్షించారు. అది సరైనదే అని రుజువయింది.

1930లో సర్ సి.వి. రామన్ భౌతిక శాస్త్రంలో నోబెల్ బహుమతి అందుకున్నాడు. ఆయన కనిపెట్టిన థియరీ 'రామన్స్ ఎఫెక్ట్' అని ప్రసిద్ధిగాంచింది.

ఆయన థియరీ రజతోత్సవ వేడుకలు 1955లో జరిగాయి. అప్పుడు సర్ సి.వి. రామన్ ప్యారీస్ నగరంలో ఉన్నాడు. ఫ్రెంచి విజ్ఞానవేత్తలు, మేధావులు ఆయనకు ఒక అభినందన కార్యక్రమం ఏర్పాటు చేశారు. విందు జరుగుతూన్నప్పుడు, ఒక ట్రేలో మెరుస్తూన్న గ్లాసులలో రకరకాల మద్యాలను బేరర్ తీసుకువచ్చాడు. ఆ ట్రేలో మద్యపానాలు తప్ప, పళ్ళరసాలుగాని, శీతలపానీయాలుగాని లేవని గ్రహించిన రామన్, వెళ్ళమని బేరర్‌ను మెల్లగా సైగచేశాడు. అయితే, బేరర్ ఆ సూచనను గమనించినట్టు లేడు. రామన్ ఎక్కడికి వెళితే, ఆయన వెంట అక్కడికి వెళ్ళసాగాడు. అయితే, తను మద్యం తీసుకోనన్న విషయం పదిమందికీ తెలియడం ఎందుకులే అనుకున్న రామన్, బేరర్‌ను పట్టించుకోకుండా అక్కడున్న వారితో మాటలు కలపసాగాడు. అయినా, బేరర్ వదిలి పెట్టేలా లేడు. పట్టువిడ

వకుండా ఆయన వెంటనే ఉంటూ అక్కడి వారందరి దృష్టి ఆయన మీద పడేలా చేశాడు.

పరిస్థితిని గమనించిన ఒక మహిళ, రామన్ బేరర్‌ను గమనించలేదనుకున్నది. ఆమె ఆయన దగ్గరికి వచ్చి, బేరర్ పట్టుకున్న ట్రేను చూపించింది. ఇక సర్ సి.వి. రామన్‌కు, తను ఏరకమైన మద్యాన్నీ తీసుకోనని చెప్పడం తప్ప మరో మార్గం కనిపించలేదు.

ఆ మాటవిన్న మహిళ, ''అలాగా, నేను మీకు చక్కని డ్రింక్ తీసి ఇస్తాను. రుచిచూశా రంటే నన్ను తప్పక మెచ్చుకుంటారు, చూడండి,'' అంటూ ట్రే నుంచి ఒక గ్లాసును తీసి రామన్‌కు అందివ్వబోయింది.

''మీ సహాయానికి చాలా కృతజ్ఞతలు! అయితే, నేను మద్యం ముట్టుకోను. క్షమిం చండి!'' అన్నాడు రామన్ ఎంతో సౌమ్యంగా.

''అయితే, నేను మీకీ సాయంచేయడం ద్వారా మీతో పరిచయం పెంచుకోవాలను కుంటున్నాను. ఆ తరవాత ఆ పరిచయాన్ని పురస్కరించుకుని మీరు కనుగొన్న సుప్రసిద్ధ సిద్ధాంతం రామన్స్ ఎఫెక్ట్ గురించి వివరించ మని అడుగుదామనుకుంటున్నాను,'' అన్నది మహిళ చిన్నగా నవ్వుతూ.

అప్పటికే పలువురు అతిథులు వారి సంభాషణలు విని శాస్త్రవేత్త స్పందన ఎలా



వుంటుందో చూడాలనుకున్నారు.

''మీరొకసారి నా ప్రయోగశాలకు వస్తే ఆల్కహాల్ మీద రామన్స్ ఎఫెక్ట్ (ప్రభావం) ఏమిటో ప్రత్యక్షంగా చేసి చూపుతాను. అయితే, ఇప్పుడు దయచేసి రామన్ మీద ఆల్కహాల్ ఎఫెక్ట్ (ప్రభావం) ఎలా ఉంటుందో చూప మని అడక్కుండా వదిలి పెట్టండి!'' అన్నాడు సర్ సి.వి. రామన్ చిన్నగా నవ్వుతూ.

చుట్టూ గలగలమని నవ్వులు వినిపించ డంతో ఆ మహిళ కూడా చిన్నగా నవ్వుతూ మరేమీ మాట్లాడకుండా ఊరుకున్నది.

-(ఎం.డి)

## చందమామ క్విజ్-1 (ఫిబ్రవరి 2008) సమాధానాలు

1. చండీఘర్‌లోని రాక్ గార్డన్ 2. కొల్‌కతా; బేలూరు మఠం 3. ఫతేపూర్‌లోని బులుంద్ దర్వాజా 4. జిమ్ కార్బెట్ – ఉత్తర ప్రదేశ్ రామగంగాలోని కార్బెట్ నేషనల్ పార్క్ 5. త్రిపురలోని కల్యాణసాగర్ కొలను; కూర్మ పీఠ్ ఆలయం.

గుజరాత్ జానపద కథ

# వందకు ఒకటి తక్కువ!

చందన్, నందన్ ఇరుగుపొరుగున నివసించేవారు. చందన్ ధనిక వర్తకుడు. కాని నందన్ పొద్దున లేచి వెళ్ళి కాయకష్టం చేస్తే తప్ప పూట గడవని పేదవాడు. చందన్‌కు అన్ని సంపదలూ ఉన్నప్పటికీ అవసరాలకు మించి దమ్మిడీ ఖర్చు పెట్టడు. వాళ్ళ ఇద్దరి మధ్య మంచి స్నేహం ఏర్పడింది.

నందన్ భార్య చారుమతికి బంధుమిత్రులంటే మహా ప్రీతి. అందువల్ల తరచూ వాళ్ళ ఇల్లు బంధుమిత్రులతో, అతిథులతో కళకళలాడుతూ ఉండేది. అతిథులకని ఆమె ప్రత్యేక వంటలు తయారు చేసేది కాదు. కాని ఆమె చేసిన వంటలను అందరూ ఇష్టపడి తినేవారు.

నందన్ ఇంట్లో బంధుమిత్రుల సందడి, వాళ్ళు భోజనం చేసేప్పుడు చెప్పుకునే ఉత్సాహపు కబుర్లు విని పొరుగున ఉన్న చందన్, అతడి భార్య పరమేశ్వరి ఆశ్చర్య పడేవారు. నందన్ సంపాదించే తక్కువ డబ్బులతో వాళ్ళెలా అతిథులకు భోజనాలు పెట్టగలుగుతున్నారా అని విస్తుపోయేవారు.

పరమేశ్వరి, చారుమతి కూడా మంచి మిత్రులు. చారుమతి, ఆమె భర్త తక్కువ ఆదాయంతో అంత హాయిగా బంధుమిత్రులతో ఎలా జీవించగలుగుతున్నారో తెలుసుకోవాలనే ఉత్సాహం పరమేశ్వరిలో కలిగింది. ఒకనాడు మాటల సందర్భంలో ఆ విషయం ప్రస్తావించింది. ఆ మాట వినగానే చారుమతి చిన్నగా నవ్వి, ''మా ఆయన వేళకు అంత మంది అతిథులను ఎలా పిలుచుకువస్తాడో నిజానికి నాకూ తెలియదు. ఉన్నట్టుండి భోజనానికి ఎంత మంది వస్తున్నారో చెబు



తాడు. ఇంట్లో ఉన్న వాటితో వంట సిద్ధం చేస్తాను. అంతే. అంతకు మించి నాకేమీ తెలియదు. బహుశా తెలివైన వర్తకుడుగనక, మీ ఆయనే నీ ప్రశ్నకు సరైన సమాధానం చెప్పగలడనుకుంటాను,'' అన్నది.

పరమేశ్వరి కొన్ని రోజులు ఆగి సరైన సమయం చూసి తనకూ, చారుమతికీ మధ్య జరిగినసంభాషణ గురించి భర్తకు చెప్పింది. ఆమె ప్రశ్నకు సమాధానం తెలిసిన వాడిలా నవ్విన చందన్, ''నీ స్నేహితురాలికీ, ఆమె భర్తకూ తొంభై తొమ్మిది శక్తి అనుభవం లేదు గనక, నిశ్చింతగా హాయిగా బతికేస్తున్నారు. ఒక్కసారి ఆ అనుభవం కలిగితే చాలు. వాళ్ళ జీవన విధానమే ఎదురు చూడనంతగా మారిపోగలదు,'' అన్నాడు.



''తొంభైతొమ్మిది శక్తి అనుభవమా? ఏమిటండీ అది?'' అని అడిగింది పరమేశ్వరి విస్మయంతో.

''ఇప్పుడు దాన్ని అంతసులభంగా వివరించడానికి లేదు. అయితే, ఏం జరుగుతుందో చూసి త్వరలో నువ్వే గ్రహించగలవు,'' అంటూ ఆ విషయాన్ని అంతటితో ముగించాడు చందన్.

మహేశ్వరి ఆ తరవాత కొన్నాళ్ళ పాటు పొరుగింటి భార్యాభర్తలను గురించి ఆలోచించడం మానేసింది. అయితే, కొన్నాళ్ళుగా పక్క ఇంటి నుంచి అతిథుల సందడి తగ్గిపోవడం గమనించి ఆశ్చర్యపోయింది. పైగా, భార్యాభర్తలు ఎప్పుడు చూసినా తుంగచాపలు అల్లడంలో నిమగ్నులై కనిపించారు. అంటే ఎక్కువ డబ్బు సంపాదించాలనే కోరిక వారిలో వేళ్ళూనిందన్న మాట.

ఇవన్నీ ఆలోచిస్తుంటే మహేశ్వరి మనసు ఊరుకోవడం లేదు. మామూలుగా మధ్యాహ్న సమయంలో పిచ్చాపాటీ మాట్లాడడానికి వచ్చే చారుమతి ఇప్పుడు రావడం మానేసింది. ఏం జరుగుతుందో తెలుసుకోవాలన్న ఉత్సుకతతో, చందన్ లేని సమయం చూసి ఒక నాటి మధ్యాహ్నం వేళ ఆమె చారుమతిని చూడడానికి వెళ్ళింది.

పరమేశ్వరిని చూడగానే చారుమతి లేచి వచ్చి ఆప్యాయంగా పలకరించి, తీసుకు వెళ్ళి పక్కన కూర్చోబెట్టుకుని చాప అల్లుతూ మాట్లాడసాగింది. కుశల ప్రశ్నలు అయ్యాక,

''అవునూ, మా ఇంటికి రావడం సొంతం మానేశావేమిటి చారుమతీ? నువ్వూ, మీ ఆయనా ఎప్పుడు చూసినా చాపలల్లుతూ ఉన్నారు కదా! మీ ఆయనకు బయట పనులు దొరకడం లేదా ఏం?'' అని అడిగింది పరమేశ్వరి.

చారుమతి తలెత్తి, ''అదేం లేదు పరమేశ్వరీ. నేనూ, మా ఆయనా మా జీవన విధానాన్ని మార్చుకోవాలనుకున్నాం. అంతే,'' అన్నది.

పరమేశ్వరి ఆమె మాటలు నమ్మలేకపోయింది. ఆమె తన నుంచి ఏదో దాచడానికి ప్రయత్నిస్తున్నట్టు అనుమానించింది. 'నేనిలా అడుగుతున్నందుకు అపార్థం చేసుకోకు. డబ్బులకు ఇబ్బందిగా ఉంటే చెప్పు, ఇస్తాను.



మీ కష్టాలు తీరడానికి నేను సాయపడతాను. ఆ సంగతి మా ఆయనకు తెలియనివ్వను. నువ్వూ మీ ఆయనకు చెప్పనవసరం లేదు,'' అన్నది ఆప్యాయంగా.

తన స్నేహితురాలి నుంచి అంతటి కనికరాన్ని ఎదురుచూడని చారుమతి, ''అలాంటిదేం లేదు, మహేశ్వరీ. మా ఆయనకు కావలసినంత పని దొరుకుతోంది. పైగా, తన సంపాదనను మరింత పెంచుకోవాలనుకుంటున్నాడు,'' అన్నది.

''ఎందుకని? ఆ అవసరం ఎందుకు వచ్చింది?'' అని అడిగింది పరమేశ్వరి.

చారుమతి ఆ మాట విని కొంతసేపు మౌనంగా ఆలోచించి, ''సరే, ఆ సంగతి నీకు చెబుతాను. అయితే, దాన్ని నువ్వు మీ ఆయనకు కూడా చెప్పకూడదు. సరేనా,'' అన్నది.

''చెప్పను. నిజం!'' అన్నది పరమేశ్వరి.

''కొన్నాళ్ళ క్రితం మా ఆయన పనికి వెళ్ళి తిరిగివస్తూ మా ఇంటి గుమ్మం ముందు మూతి బిగువుగా కట్టిన చిన్న సంచీని చూశాడు. దాన్ని తీసుకుని లోపలికి వచ్చి కిటికీ దగ్గర పెడుతూండగా గలగలమని నాణాల శబ్దం వినిపించింది. మా ఆయన సంచీ మూతివిప్పి నాణాలను నేలపై కుమ్మరించాడు. అవి నిగనిగలాడే వెండి నాణాలు. లెక్కపెడితే తొంభైతొమ్మిది నాణాలున్నాయి. మళ్ళీ లెక్కపెట్టాడు. 'చారుమతీ, మొత్తం ఎన్ని ఉన్నాయో చూడు,' అంటూ నన్ను పిలిచాడు. నేను లెక్కపెట్టినా తొంభైతొమ్మిదే

ఉన్నాయి. 'వందకు ఒక్కనాణెం ఎందుకు తగ్గుతున్నది?' అని నన్ను అడిగాడు. 'ఎందుకు తగ్గింది? ఎందుకు ఒక నాణెం తక్కువ? అని కొంత సేపు తర్జన భర్జన పడ్డ మా ఆయన హఠాత్తుగా "ఏం చేయాలో నాకు తెలుసు,' అంటూ ఆ రోజు తను సంపాదించిన దానిలో నుంచి ఒక నాణెం తీసి ఆ సంచీలో వేసి, మూతి బిగించి, పక్కన పెట్టాడు,'' అన్నది చారుమతి.

''ఆ తరవాత ఏమయింది?'' అని అడిగింది పరమేశ్వరి.

'' ఆ తరవాత మా ఆయన రోజూ ఒక నాణాన్ని సంచీలో వేయాలని నిర్ణయించాడు. ఆ క్షణమే పొదుపు చేయడం ప్రారంభించాం. కొన్ని రోజులు పనికి వెళ్ళకుండా ఇంటి పట్టునే ఉండి చాపలల్లడం మొదలు పెట్టాడు. ఆ విధంగా మరింత ఆదాయం రాసాగింది. దాన్ని సంచీలోని నాణాలతో చేర్చసాగాము,'' అని ఆగింది చారుమతి.

''బావుంది కానీ, మీ బంధుమిత్రుల హడావుడి ఇప్పుడు కొన్నాళ్ళుగా కనిపించడం లేదే! వాళ్ళకేమయింది?'' అని అడిగింది పరమేశ్వరి.

''అదా! వాళ్ళిప్పుడు మా ఇంటికి రావడం లేదు. అందుకు కారణం మేము వారిని పిలవకపోవడం కాదు. కొందరు ఊరు వదిలి వెళ్ళారు. మరి కొందరు మేము ఎప్పుడూ పనుల మీద ఉండడం చూసి ఇటువైపు రావడం తగ్గించారు,'' అన్నది చారుమతి.

'తొంభైతొమ్మిది' తమ పొరుగు కుటుంబంలో ఎలాంటి మార్పు తీసుకువచ్చిందో పరమేశ్వరికి ఇప్పుడు అర్థమయింది. అయినా, ఆమె తన స్నేహితురాలికి ఇచ్చిన మాటను నిలుపుకుని, ఆ సంగతిని తన భర్తకు చెప్పలేదు. అయినా, అదృష్టవశాత్తు ఆమె భర్తకు పొరుగింటి వారిని గురించి ఆలోచించేటంతటి తీరిక సమయంలేదు. తెలివైనవాడు గనక-తమ పొరుగువారి జీవన విధానంలో మార్పు రావడానికి తనే బాధ్యుడన్న రహస్యాన్ని బయటపెట్ట కూడదని నిర్ణయించాడు. చందన్ నందన్ మంచి మిత్రులుగా కొనసాగారు.



చందన్ దాచిన రహస్యం ఏమిటో మీరు ఊహించగలరా?

## చిరస్మరణీయ చారిత్రక ఘట్టాలు-7

# వీరనారి ఝాన్సీరాణి

పరాయి పాలకుల అణచివేతపై తిరుగుబాటు జరిపి మాతృభూమిస్వాతంత్ర్యం కోసం ప్రాణా లర్పించడానికిసైతం వెనుకాడకుండా భారత వీరులు పోరాటం ప్రారంభించిన కాలఘట్టం అది. వ్యాపారం కోసమని వచ్చిన ఆంగ్లేయులు తమ ఈస్ట్ ఇండియా కంపెనీ ద్వారా దేశాన్ని వశపరచుకోవడం ప్రారంభించారు. అది 1857వ సంవత్సరం. అంతవరకు లోలోపల రగులుతూన్న తిరుగుబాటు జ్వాల ఒక్కసారిగా అగ్నిపర్వతంలా బద్దలయింది. దురాక్రమణ దారులు స్థానిక సంస్థానాలను ఏదో ఒక నెపం మీద ఆక్రమించుకోసాగారు. అలా వాళ్ళు ఝాన్సీ మీద దాడిని ప్రారంభించారు. అప్పుడు ఝాన్సీ కోట బురుజులపై నుంచి ఒక కంఠస్వరం ఉరుములా ఉరి మింది: ''ఝాన్సీని వదులుకోవడమా? అసంభవం! ఎన్నటికీ సాధ్యపడదు. దమ్ములున్న వాడు ప్రయత్నించనీ!''

అలాంటి దృఢనిర్ణయంతో గర్జించింది ఏ రాజో కాదు. పట్టుమని ఇరవైయేళ్ళు కూడా నిండని ఝాన్సీరాణి లక్ష్మీబాయి!

1830 ప్రాంతంలో మోరాపంత్ టాంబే, భాగీరథీబాయిలకు జన్మించిన ఆమెకు మణికర్ణిక అని నామకరణం చేశారు. పసిప్రాయం నుంచి ఆమె చదువు-సంధ్యలలో, ఆటపాటలలో విలక్షణమైన ప్రతిభను కనబరచింది. ఏడేళ్ళ ప్రాయంలోనే గుర్రపుస్వారీ నేర్చుకున్న ఆమె కత్తిసాము, విలువిద్య మొదలైన యుద్ధ విద్యలలో ఆరితేరింది. మగపిల్లలకు మించిన సామర్థ్యాన్ని కనబరచేది. బాల్యంలో తండ్రి చెప్పినపురాణ కథలనూ, వీరగాథలనూ విని వీరుల లక్షణాలను, ఉదాత్త గుణగణాలను హృదయంలో పదిలపరచుకున్నది.



అసాధారణమైన ఆ అమ్మాయిని చూసి ముగ్ధులైన ఝాన్సీ వంశరక్షకులైన కొందరు పురోహితులు, రాజా గంగాధరరావుతో ఆమె వివాహం జరిపించారు. ఆ విధంగా మణికర్ణిక ఝాన్సీరాణి లక్ష్మీబాయి అయింది. ఆమెకో మగసంతానం కలిగింది కాని, దురదృష్టవశాత్తు వెంటనే మరణించింది. విషాదగ్రస్తులైన రాజ దంపతులు ఒక మగబిడ్డను దత్తత చేసుకుని అతనికి దామోదరరావు అని పేరు పెట్టారు. మరికొన్నాళ్ళకే రాజా మరణించడంతో లక్ష్మీ బాయి పద్దెనిమిదవ యేటనే వితంతువు అయింది. అయినా ఏమాత్రం జంకకుండా సంస్థాన పాలనా బాధ్యతలు చేపట్టి దక్షతతో నిర్వర్తించసాగింది. తమరాణిని ప్రజలు దేవతలా భావించి గౌరవించేవారు.

భారతీయ సంప్రదాయం ప్రకారం దత్త పుత్రుడు కూడా కన్న బిడ్డకు సమానుడే. అయితే, గవర్నర్ జనరల్ లార్డ్ డల్హౌసీ విచిత్రమైన నిబంధనలు విధించాడు. వారసులు లేని సంస్థానాన్ని కంపెనీ తమ రాజ్యంలో కలుపుకుంటుందని చెప్పాడు. అందుకు రాణి అంగీకరించకుండా ఎదురుతిరగడంతో ఝాన్సీని జయించడానికి సైన్యాన్ని పంపాడు.

ధైర్యవంతులైన సైనికులతో కోట రక్షణకు రాణి తగిన చర్యలు తీసుకుని ఇరవై నాలుగు గంటలూ పర్యవేక్షించసాగింది. తల్లిలాంటి తమ రాణి కోసం, పవిత్రమైన స్వాతంత్ర్యం కోసం తమ ప్రాణాలు త్యాగం చేయడానికి వీరులు సంసిద్ధులయ్యారు. ప్రతిబురుజు వద్ద, ద్వారం సమీపంలో తుపాకులతో సైనికులను నిలిపి కోటకు బలమైన రక్షణా ఏర్పాట్లు చేసి స్వయంగా పర్యవేక్షిస్తూ సైనికులలో మరింత స్ఫూర్తిని కలుగ జేసింది. తెల్లటి దుస్తులు ధరించి, తెల్లటి గుర్రం మీద స్వయంగా సేనకు నాయకత్వం వహించింది. గుర్రం పగ్గాలను నోటితో పట్టుకుని రెండు చేతులతో ఖడ్గాలు తిప్పి శత్రు సేనల తలలను తెగనరికింది. ఆఖరికి శత్రు సేనలు హడలిపోయి వెనుదిరిగి పారిపోయాయి.

కొన్ని నెలలు ప్రశాంతంగా గడిచాయి. ఓటమిని భరించలేని బ్రిటిష్ పాలకులు అప్పటి శక్తివంతుడైన సేనానాయకుడు సర్ హగ్ రోజ్ సాయాన్ని కోరారు. 1858లో బ్రిటిష్ సైనికులు ఝాన్సీని ముట్టడించారు. వారి వద్ద శక్తివంత మైన తుపాకులు, ఫిరంగులు ఉన్నాయి. వాటితో పాటు టెలిస్కోపుల ద్వారా దూరం నుంచే చూడగల అదనపు సౌకర్యం ఉన్నది. అయినప్పటికీ బ్రిటిష్ సేనల మీద మెరుపుదాడులు జరిపి, గెలుపు ఓటముల



నీడలో కొన్నాళ్ళ పాటు బ్రిటిష్ సేనలను కోట లోకి జొరబడనీయకుండా అడ్డుకున్నది రాణి.

ఈ సంఘటన గురించి హగ్ రోజ్ ఆ తర వాత ఇలా రాశాడు: ''ధైర్యసాహసాలకు, తెలివి తేటలకు, పట్టుదలకు రాణి ప్రశంసించ తగ్గ వ్యక్తి. ఆమె తన అనుచరుల పట్ల చూపిన దయ ఎల్లలు లేనిది. వీటితో పాటు ఆమె సేనలు కలిసి ఆమెను చాలా ప్రమాదకరమైన తిరుగు బాటు నాయకురాలిగా చేశాయి.''

బ్రిటిష్ వాళ్ళు ఆమెను అసమానమైన ధైర్య శాలిగా పరిగణించారు.

అయినా, తమ కన్నా శక్తివంతులైన దురాక్ర మణదారులను ఆమె ఎన్నాళ్ళని ఎదుర్కొన గలుగుతుంది? ఆమె సైనిక బలం, ఆయు ధాలు వేగంగా తరిగిపోసాగాయి. అయితే కోట ఉపరితలంలో నిలబడి ఉండగా దూరంలో కనిపించిన దృశ్యం ఆమెకు సంతోషం కలిగిం చింది. ఝాన్సీ కేసి పెద్ద సైన్యం వస్తున్నది. మరాఠా వీరుడు తాంతియా తోపే ఆ సేనలకు నాయకత్వం వహించి నడిపిస్తున్నాడు. నగ రాన్ని ముట్టడి నుంచి కాపాడాలన్న రాణిగారి విజ్ఞప్తిని అందుకుని ఆ స్వాతంత్ర్యవీరుడు సాయపడడానికి సేనలతో వస్తున్నాడు. ఆయన బ్రిటిష్ సేనలపై వెనుకనుంచి దాడి చేశాడు. ముందు దీటైన రాణి, వెనక ఇరవై రెండు వేల సైన్యంతో మరాఠాపులి! శత్రుసేనలు దిక్కు తోచక తల్లఢిల్లి పోయాయి.

హడలిపోయి ఉద్రిక్తతకు లోనైన బ్రిటిష్ సేనలు కోట కేసి దూసుకుపోయాయి. ఈ విపత్కర సమయంలో కోట రక్షకుడొకడు లంచానికి ఆశపడి ద్రోహం తలపెట్టాడు. శత్రువు లకు ఒక కోట ద్వారాన్ని తెరిచాడు. హగ్ సేనలు కోటలోకి చొచ్చుకు పోయాయి. వారు పిల్లలు, వృద్ధులు, స్త్రీలు అన్న విచక్షణ చూపకుండా అక్కడున్న అందరినీ హతమార్చారు. సర్వాన్ని దోచుకున్నారు. క్రూరులైన శత్రువుల దురాగ తాలకు లోను కాకుండా వందలాది మంది స్త్రీలు అక్కడున్న లోతైన బావుల్లోకి దూకేశారు. నగరం అగ్నికి ఆహుతయ్యింది. ఆకాశం హాహా కారాలతో ప్రతిధ్వనించింది.

ఆ దృశ్యాలను చూసిన రాణి కళ్ళు కన్నీళ్ళతో నిండిపోయాయి. గొంతు మూగ బోయింది. ఒకటి శత్రువులకు లొంగి పోవడం; రెండు తుది శ్వాస ఉన్నంత వరకు పోరాడడం. లేదా అక్కడి నుంచి తప్పించుకుని వెళ్ళి సేనలను సమకూర్చుకుని శత్రువులతో యుద్ధం చేయడం. ఆమె ముందు ఈ మూడు ప్రత్యామ్నాయాలే కనిపించాయి. రాణి మూడవ ప్రత్యామ్నా యాన్ని ఎన్నుకుని అక్కడి నుంచి బయట పడాలని నిర్ణయించింది.



అది వెన్నెల రాత్రి. రాణి తప్పించుకో కుండా కోట చుట్టూ శత్రు సైనికుల కాపలా పకట్బందీగా ఉన్నది. భవనాన్ని ఆనుకుని ఎక్కడో కింద రాణిగారి గుర్రం నిలబడివుంది. రాణి చంటిబిడ్డను వీపుకు కట్టుకుని, తాడు సాయంతో మరో కంటికి తెలియకుండా జారి వచ్చి గుర్రం వీపుపై కూర్చున్నది. ఎవరికీ తెలి యని ద్వారం గుండా వెలుపలికి వచ్చింది. వెలు పల విశ్వాసపాత్రులైన స్త్రీపురుషులు ఆమెతో చేరారు. అందరూ ఏమాత్రం అదురూ బెదురూ లేకుండా, రాణిగారి ఆజ్ఞానుసారం, ఎవరికీ అనుమానం రాకుండా పిచ్చాపాటీ మాట్లాడు కుంటూ, నవ్వుకుంటూ ముందుకు నడిచారు.

''ఎవరు మీరు?'' అని అడిగారు కొందరు బ్రిటిష్ సైనికులు.

''ఓర్ఛా నుంచి వస్తూన్న మీ మిత్రులం. మీకు సాయంగా వస్తున్నాం,'' అన్నారు వాళ్ళు. వాళ్ళ మాటలు మరీ విచార రహితంగా, మామూలుగా ఉండడంతో, పురుషవేషంలో వెళుతూన్న రాణికి అంగరక్షకులుగా వెళుతున్నా రని శత్రువులు అనుమానించలేక పోయారు. అదే సమయంలో రాణి దళనాయకుడు మరోవైపు నాలుగు వందల మంది సైనికులతో పోరాటం కొనసాగిస్తూ వచ్చాడు. తెల్లవారేసరికి అందరూ హతు లయ్యారు.

రాణి కోట నుంచి తప్పించుకున్నదన్న విషయం తెలియడంతో ఆగ్రహోదగ్రుడైన హగ్ రోజ్, ఆమెను తరిమి పట్టుకోమని జనరల్ డౌకర్‌ను ఆజ్ఞాపించాడు. రాణి సేనలకూ బ్రిటిష్ సేనలకూ మధ్య భీకరసంగ్రామం జరి గింది. హఠాత్తుగా కత్తి దెబ్బతో డౌకర్‌ను కింద పడగొట్టి రాణీ లక్ష్మీబాయి అక్కడి నుంచి తప్పించుకున్నది. రాయిరప్పలు, బండలు నిండిన మార్గం గుండా వీపుపై శిశువును కట్టు కుని గుర్రం మీద దాదాపు వందమైళ్ళు ప్రయాణం చేసి కల్పీ చేరుకున్నది. గమ్యం చేరగానే గుర్రం నేలకు ఒరిగి ప్రాణాలు విడి చింది. హగ్ రోజ్ కల్పీకి సేనలను నడిపించి యుద్ధం చేసి ఆ రాజ్యాన్ని వశ పరచుకున్నాడు గాని, రాణి జాడ కనుగొన లేకపో యాడు.



రాణి గ్వాలియర్‌కు చేరింది. ఆంగ్లేయుల అనుచరుడైన అక్కడి పాలకుడు కోటను వదిలి పారిపోయాడు. రాజ్య ప్రజలు ఆనందోత్సాహాలతో రాణికీ, ఆమెతో పాటు దేశభక్తులైన తాంతియాతోపే, రావుసాహెబ్ పీష్వాలకూ మద్దతు తెలియజేశారు. సైన్యాన్ని సమీకరించడం జరిగింది.

సర్ హగ్ రోజ్ నాయకత్వంలో దాడి చేసిన బ్రిటిష్ సేనలను రాణి దీటుగా ఎదుర్కొన్నది. కాని క్రమేణా ఆమె పక్షంలోని సైనికులు తరిగిపోసాగారు. వారిని ఉత్సాహపరుస్తూ, తనే స్వయంగా యుద్ధ రంగంలోకి ఉరికి పోరాడ సాగింది. అయినా హగ్ రోజ్ ఒంటెల సైన్యాన్ని తట్టుకోవడం కష్టమనిపించింది.

క్రమంగా బ్రిటిష్ సేనలు అన్ని వైపుల నుంచీ తనను చుట్టుముట్టడం ఆమె గ్రహించింది. ఇరవై మంది సైనికులతో, ఇద్దరు పరిచారికలతో శత్రుసైనికుల వలయాన్ని ఛేదించుకుని ఆవలికి వెళ్ళాలి. అంతలో కీచుమనే ఏడుపు వినిపించింది. వెనక్కు తిరిగి చూస్తే తన పరిచారికను ఒక బ్రిటిష్ సైనికుడు కాల్చినట్టు తెలిసింది. ఆగ్రహించిన రాణి ఒక్క కత్తి వేటుతో ఆ బ్రిటిష్ సైనికుడి తలను తెగనరికి గుర్రంపై ముందుకు వెళ్ళింది. దారిలో ఆమె ఒక చిన్న నదిని దాటవలసివచ్చింది. అయితే, ఎంత అదిలించినప్పటికీ గుర్రం నదిలో దిగలేదు. అంతలో శత్రుసైనికులు ఆమెను చుట్టుముట్టారు. ఆమె ఒక్క ఖడ్గం అనేక ఖడ్గాలను వీరోచితంగా ఎదుర్కొన్నది. చాలా మందిని హతమార్చింది. మరెందరినో క్షతగాత్రుల్ని చేసి, గాయపడి నేలకొరిగింది. పురుష వేషంలోని రాణిని ఆమె దళనాయకుడని పొరబడ్డ సైనికులు ఆమెను అక్కడే వదిలి తమ శిబిరాలకు తిరిగి వెళ్ళారు.

విశ్వాసపాత్రులైన రాణిగారి అనుచరులు కొందరు ఆమెను దాపులనున్న గుడిసెలోకి మోసుకు వెళ్ళారు. తను మరణించిన వెంటనే భౌతికకాయాన్ని శత్రువుల కంటబడకుండా కాల్చివేయమని అనుచరులకు సూచనలిచ్చి, ఆమె తుదిశ్వాస విడిచింది. స్వాతంత్ర్యం కోసం సాటిలేని ధైర్యసాహసాలతో పోరాడి జాతికి స్ఫూర్తినిచ్చిన వీరనారీ శిరోమణి ఝాన్సీ లక్ష్మీబాయి మరణించినప్పుడు ఆమె వయసు ఇరవై ఒక్క సంవత్సరాలు మాత్రమే!



బీర్బల్ కథలు : 8

# న్యాయమైన తీర్పు

అక్బర్ చక్రవర్తి ఒకనాడు సభను ఉద్దేశించి, ''మన న్యాయవ్యవస్థ సక్రమంగా పనిచేస్తున్నది కదా?'' అని అడిగాడు.

''బ్రహ్మాండంగా పనిచేస్తున్నది షహేన్‌షా! మన న్యాయమూర్తులు న్యాయశాస్త్రాన్ని క్షుణ్ణంగా అభ్యసించినవారు; నిజాయితీ పరులు; పక్షపాతం లేనివారు. వ్యాజ్యాలను అప్పటికప్పుడే పరిష్కరించాలనే శ్రద్ధకలవారు,'' అన్నాడు ఒక సభికుడు.

''మన చట్టాలు న్యాయమైనవి. చట్టం ముందు అందరూ సమానులు!'' అన్నాడు మరొక సభ్యుడు.



తక్కిన సభికులు కూడా అదే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. ఒక్క బీర్బల్ మాత్రం మౌనంగా ఊరుకున్నాడు. దానిని గమనించిన అక్బర్, ''బీర్బల్, నా పాలనలో న్యాయవ్యవస్థ సంతృప్తికరంగా లేదని నువ్వు భావిస్తున్నావా?'' అని ప్రశ్నించాడు కనుబొమలు ముడిచి.

''అలా భావించేంతవాణ్ణి కాదు గాని, కేవలం మంచి చట్టాలు, న్యాయమూర్తులు ఉన్నంత మాత్రాన న్యాయవ్యవస్థ సజావుగా సాగుతుందని చెప్పలేము కదా ప్రభూ!'' అన్నాడు బీర్బల్ వినయంగా.

అంతలో ఒక భటుడు సభలోకి వచ్చి చక్రవర్తికి వంగి నమస్కరించి, ''ఒక వృద్ధుడు, ఒక యువకుడు న్యాయం కోరి తమ దర్శనం కోసం వచ్చారు ప్రభూ!'' అన్నాడు.

''అలాగా! సభకు తీసుకురా!'' అని ఆజ్ఞాపించాడు చక్రవర్తి.

తిరిగి వెళ్ళిన భటుడు కొంత సేపటికి ఒక వృద్ధుణ్ణీ, ఒక యువకుణ్ణీ వెంటబెట్టుకుని వచ్చాడు. నెరిసిన గడ్డంతో, ముడతలు పడ్డ చర్మంతో ఉన్న ఆ వృద్ధుడి కళ్ళు మాత్రం జ్ఞానంతో మెరుస్తున్నాయి. యువకుడు ఎంతో ఆత్మవిశ్వాసంతో కనిపించాడు. ఇద్దరూ వంగి చక్రవర్తికి సలాం చేశారు.

''ఎవరు మీరు ఏ పనిమీద వచ్చారు?'' అని అడిగాడు చక్రవర్తి.

''షహేన్‌షా! నా పేరు అబ్దుల్ రహ్మాన్. యువ

కులకు చట్టం బోధించడం నా వృత్తి. అందుకు వారు చెల్లించే డబ్బుతో జీవయాత్ర సాగిస్తు న్నాను,'' అని ఆగాడు వృద్ధుడు.

''మరి ఇప్పుడు నీకు వచ్చిన కష్టం ఏమిటి?'' అని అడిగాడు చక్రవర్తి.

''నేను ప్రమోద్ బిహారీ అనే ఈ యువకు డికి చట్టం బోధించాను. ఇతడు వచ్చి చట్టం బోధించమని అడిగినప్పుడు నాకు చెల్లించ వలసిన డబ్బు గురించి చెప్పాను: నెలకు మూడు మొహరీలు పుచ్చుకుంటాను. ఒక సంవత్సరం పాటు విద్యాబోధన కొనసాగు తుంది. ఇతడు నిరుపేద అనీ, పైకం చెల్లించ లేననీ చెప్పాడు. నేను ఇతడిపై జాలిపడి, మొదట నేను విద్యనేర్పుతాననీ, విద్యముగించి మొదటి వ్యాజ్యంలో గెలుపొందాక నాకు చేరవలసిన ముప్పై ఆరు మొహరీలు చెల్లిం చవచ్చనీ చెప్పాను. అందుకు ఇతడు అంగీక రించాడు. చట్టం బోధించాను. చాలా తెలివైన వాడు గనక, చట్టంలోని సూక్ష్మ అంశాలన్నిటినీ సులభంగా గ్రహించగలిగాడు. ఇతణ్ణి చూసి నేనెంతో గర్వ పడ్డాను. మంచి న్యాయవాది కాగలడని సంబరపడ్డాను. విద్య పూర్తిచేసి మొదటి వ్యాజ్యం గెలుపొందిన వెంటనే నాకు చెల్లించవలసిన మొత్తాన్ని చెల్లించగలడని ఆశపడ్డాను,'' అని ఆగాడు వృద్ధుడు.

''ఇప్పుడు చెల్లించడానికి నిరాకరిస్తున్నాడు. అంతే కదా?'' అని అడిగాడు చక్రవర్తి.

''లేదు, ప్రభూ, చెల్లించడానికి నిరాకరిం చడం లేదు. మొదటి వ్యాజ్యాన్ని గెలిచిన ప్పుడు చెల్లిస్తానని చెబుతున్నాడు. అది ఎన్న టికీ జరగదేమో అన్నది నా భయం,'' అన్నాడు వృద్ధుడు.

''ఎందుకు?'' అని అడిగాడు చక్రవర్తి ఆత్రుతగా.

''ఇప్పుడు న్యాయవాద వృత్తిని చేపట్ట నంటున్నాడు. ఇతడు వాదిస్తే తప్ప వ్యాజ్యంలో గెలుపొంద లేడు. గెలుపొందితే తప్ప నాకు రావలసిన మొత్తం రాదు,'' అన్నాడు వృద్ధుడు విచారంగా.



చక్రవర్తి యువకుడికేసి తిరిగి, ''ఆయన నీకు చట్టం బోధించాడా?'' అని అడి గాడు.

''అవును, ప్రభూ.''

''చట్టం నేర్చుకున్న న్నాళ్ళు నువ్వు డబ్బు చెల్లిం చలేదు, అవునా!''

''అవును, ప్రభూ!''

''ఇప్పుడు తొలి వ్యాజ్యంలో గెలుపొంది చెప్పిన మొత్తాన్ని

ఆయనకు చెల్లించవచ్చు కదా!''

''నిజమే. చెల్లించవచ్చు. అయితే, న్యాయవాద వృత్తిని చేపట్టే ఉద్దేశం నాకు లేదు, ప్రభూ!''

''ఎందుకని?''

''ఇటీవల సంపన్నుడైన మా పెదతండ్రి మరణించాడు. ఆయనకు బోలెడు పొలాలు, పళ్ళ తోటలు ఉన్నాయి. ఆయనకు సంతానం లేదు గనక, ఆయన ఆస్తి మొత్తం నాకు సంక్రమించింది. ఇప్పుడు నేను ధనవంతుణ్ణి. న్యాయవాద వృత్తి చేపట్టవలసిన అవసరం నాకు లేదు. త్వరలో నేను మా పెదనాన్న ఇంటికి వెళ్ళాలనుకుంటున్నాను,'' అన్నాడు యువకుడు.

''నువ్వు తొలి వ్యాజ్యంలో గెలుపొందితే గాని, చట్టం నేర్పిన గురువుకు చెల్లించవలసిన పైకం చెల్లించవన్న మాట!''

''అది మేము ఏర్పరచుకున్న ఒప్పందం ప్రభూ!'' అన్నాడు యువకుడు.

''అది నిజమా?'' అంటూ చక్రవర్తి వృద్ధుడి కేసి తిరిగాడు.

''అవును, షహేన్‌షా!'' అన్నాడు వృద్ధుడు నెమ్మదిగా.

''మరి, ఆ యువకుడి మీద మేమెలా చర్య తీసుకోగలం? నీకెలా సాయపడగలం?'' అన్నాడు చక్రవర్తి ఏం చేయడానికీ తోచని అయోమయంతో.

''షహేన్‌షా,'' అన్నాడు యువకుడు.

ఏమిటి అన్నట్టు చూశాడు చక్రవర్తి.

''నేను న్యాయవాద వృత్తిని చేపట్టి తొలి వ్యాజ్యాన్ని గెలుపొందిన మరుక్షణమే మా



గురువుగారికి చెల్లించవలసిన సొమ్మును తప్పక చెల్లిస్తాను. ఆయన మంచివారు. చట్టం బోధించడంలో నిపుణులు. ఆయన కారణంగానే నాకు ఈ మాత్రం చట్ట పరిజ్ఞానం కలిగింది. చట్టం ఎలా పనిచేస్తుందో నాకు బాగా తెలుసు,'' అన్నాడు యువకుడు.

చక్రవర్తికి వృద్ధుడి పట్ల సానుభూతి కలిగింది. అయితే, వృద్ధుడికి కావలసింది సానుభూతికాదు. నేర్పిన విద్యకు ప్రతిఫలంగా రావలసిన డబ్బు. దాన్ని ఆ యువకుడి నుంచి వసూలు చేసే మార్గం చక్రవర్తికి అంతుబట్ట లేదు. ఆయన సభికుల కేసి చూశాడు.

''పెద్దాయన వేచి ఉండక తప్పదు. యువకుడు తొలివ్యాజ్యాన్ని గెలుపొందినప్పుడే

ఆయనకు చెందవలసిన పైకం ముట్టజెప్ప గలడు,'' అన్నాడు సభికులలో అందరికన్నా వృద్ధుడు.

''అదే న్యాయసమ్మతం!'' అన్నారు తక్కిన సభికులు.

''యువకుడు చెప్పడం నిజమే. అతడు తన తొలి వ్యాజ్యం గెలుపొందేంతవరకు, చెల్లించవలసిన అవసరం లేదు,'' అన్నాడు బీర్బల్ యువకుడికేసి నవ్వుతూ చూస్తూ.

యువకుడు చిన్నగా నవ్వాడు. తనకు చెందవలసిన డబ్బు తప్పక ముట్టుతుందన్న నమ్మకంతో వచ్చిన వృద్ధుడికి ఆశాభంగమే ఎదురయింది.

''నీకు డబ్బు ముట్టాలి, నిజమే. అయినా నువ్వు చేసుకున్న ఒప్పందం ప్రకారం యువకుడు తొలివ్యాజ్యం గెలుపొందేవరకు ఆగక తప్పదు,'' అన్నాడు చక్రవర్తి.



ఆ మాట విని వృద్ధుడు కళ్ళనీళ్ళ పర్యంతమై పోయాడు. తను చేయగలిగిందేమీ లేక మౌనంగా ఉండిపోయాడు.

యువకుడు వృద్ధుడికేసి హేళనగా చూసి, చక్రవర్తికేసి తిరిగి, ''కృతజ్ఞతలు ప్రభూ! న్యాయం నా పక్షంలో ఉందనీ, ప్రభువులు తప్పక న్యాయమైన తీర్పునివ్వగలరనీ నాకు ముందే తెలుసు,'' అన్నాడు.

ఆ తరవాత ఆ ఇద్దరూ చక్రవర్తికి వంగి నమస్కరించి సభనుంచి వెలుపలికి నడుమసాగారు.

''ఒక్క నిమిషం!'' అన్న బీర్బల్ కంఠస్వరం విని యువకుడు తిరిగి చూశాడు. వృద్ధుడు అలాగే నిలబడ్డాడు.

''నీ మొదటి వ్యాజ్యం గెలుపొందగానే గురువుగారికి చెల్లించవలసిన మొత్తాన్ని చెల్లిస్తానని మాట ఇచ్చావు కదా!'' అన్నాడు బీర్బల్.

''అవును, తప్పక ఆ మాట నిలుపుకుంటాను,'' అని బదులిచ్చాడు యువకుడు.

''బావుంది. ఇప్పుడే నువ్వు రాజసభలో నీ వ్యాజ్యం గెలుపొందావు. తొలి వ్యాజ్యం గెలుపొందావు. కాబట్టి...'' అంటూ అర్ధంతరంగా ఆగాడు బీర్బల్.

ఆ మాటకు ఉలిక్కిపడ్డ యువకుడు గురువుకు అనుకున్న మొత్తం చెల్లించక తప్పదని గ్రహించాడు. వృద్ధుడు బీర్బల్‌కూ, చక్రవర్తికీ న్యాయమైన తీర్పునిచ్చినందుకు కృతజ్ఞతలు చెప్పాడు.

''అద్భుతంగా చెప్పావు బీర్బల్,'' అంటూ సింహాసనంపై నుంచి లేచిన అక్బర్ చక్రవర్తి, బీర్బల్‌ను ఆప్యాయంగా కౌగిలించుకున్నాడు.

# చందమామ క్విజ్ - 3

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

Co-sponsored by
Infosys® FOUNDATION, Bangalore

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మన దేశంలో 28 రాష్ట్రాలూ 7 కేంద్రపాలిత ప్రాంతాలూ ఉన్నాయి. వాటికిసంబంధించిన అంశాలు కొన్నిటిని ఈనెల క్విజ్‌లో చూద్దాం.

మీరు చేయవలసిందేమంటే : 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ క్విజ్- 3 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. ఏప్రిల్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. జూన్ 2008 నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.



1. భారతదేశ 'చక్కెరాగారం'గా ప్రసిద్ధిగాంచిన రాష్ట్రం ఏది?
2. 1947లో ఒక రాష్ట్రం వయోజన ఓటుహక్కు ప్రాతిపదికలో ఎన్నికలు నిర్వహించింది. ఆ రాష్ట్రం ఏది?
3. 'రైటర్స్ బిల్డింగ్' ఎక్కడ ఉన్నది? దాని ప్రాముఖ్యత ఏమిటి?
4. 'వృక్షశాస్త్ర వేత్తల స్వర్గం'గా ఏ రాష్ట్రాన్ని చెబుతారు?
5. ఒరిస్సా ప్రాచీన నామం ఏమిటి?
6. ఒక కేంద్ర పాలిత ప్రాంతం మూడు విభిన్న రాష్ట్రాలలో ఉన్నది. అది ఏది?
7. 'దేవభూమి'గా ఏ రాష్ట్రాన్ని చెబుతారు?
8. 'ఎర్రనది' ఎక్కడ ఉన్నది? దాని అసలు పేరేమిటి?
9. ఉమ్మడి రాజధానిగల రెండు రాష్ట్రాలు ఏవి?
10. రాజ్యసభ స్థానాలు అత్యధికంగా గల రాష్ట్రం ఏది? ఎన్ని స్థానాలు?
11. మహాభారత యుద్ధం జరిగిన కురుక్షేత్రం ఎక్కడ ఉన్నది?
12. ఉర్దూ అధికార భాషగా గల రాష్ట్రం ఏది?

శాంత మనసు ఆనందంతో ఉరకలు వేసింది. ఈ వేసవి సెలవులకు కేరళకు వెళుతూన్న సంతోషకరమైన వార్తను చెబుతూ ఆరోజు తల్లి శాంతను పడక నుంచి లేపింది. మలయాళీలకు చాలా ముఖ్యమైన పండుగ అయిన విషు వేసవి సెలవుల్లోనే కదా వస్తుంది అన్న విషయం గుర్తురావడంతో, ''అమ్మా విషూకు మనం కేరళలో ఉంటామా?'' అని తల్లిని అడిగింది. ''అవును, ఈసారి విషూను అమ్మమ్మ, తాతయ్యలతో కలిసి జరుపు కుంటాం,'' అన్నది తల్లి చిన్నగా నవ్వుతూ.

సుదీర్ఘమైన రైలు ప్రయాణం తరవాత వాళ్ళు అక్కడికి చేరారు. శాంత పరుగున వెళ్ళి అమ్మమ్మ చేతుల్లోకి చేరుతూ, ''విషు ఎప్పుడు అమ్మమ్మా?'' అని అడిగింది ఉత్సా హంగా. ''రేపేనమ్మా! మొదట నువ్వు ఇంటి లోపలికి రా,'' అన్నాడు తాతయ్య నవ్వుతూ.

విషూకు కావలసిన వస్తువులను సేకరిం చుకు రమ్మని తాతయ్య ఇంట్లోని చిన్నన్, కణ్ణన్ అనే ఇద్దరు పనిమనుషులను పురమా యిస్తుండడం గమనించిన శాంత, వాళ్ళ వెంట వెళ్ళి వస్తానని పట్టుబట్టి బయలుదేరింది.

ఆమె చిన్నన్ వెంట పెరటి తోటలోకి వెళ్ళింది. కణ్ణన్ దూరంగా వెళుతూండడం చూసి, ''అతడెక్కడికి వెళుతున్నాడు?'' అని అడిగింది చిన్నన్‌ను. ''ఇప్పుడే వస్తాడులే,'' అన్నాడు చిన్నన్ ముక్తసరిగా.

దారిలో తనకోసం తాతయ్య కట్టిన ఊయల వేలాడుతూన్న మామిడిచెట్టు కనిపించింది. కొమ్మల నుంచి దోరగా మాగిన మామిడిపళ్ళు గుత్తులు గుత్తులుగా కనిపించాయి. చిన్నన్ కొన్నిటిని కోసి పేముబుట్టలో వేసుకున్నాడు. వాటి కమ్మని వాసన శాంతను ఆహ్లాదపరి చింది. ''తరవాత ఏమిటి?'' అని అడిగింది శాంత చిన్నన్‌ను. ''చూస్తావుగా. మరీ అంత



# శాంత విషుపండుగ

తొందరెందుకు? నా వెంట రా,'' అంటూ ముందుకు నడిచాడు చిన్నన్.

కొంతసేపటికి ముళ్ళ కంచె గల తోటలోకి వాళ్ళు అడుగుపెట్టారు. కొమ్మలూ, రెమ్మలూ కనిపించనంతగా బంగారు పసుపు రంగు పూలతో విరబూసిన పొడవాటి 'అరళి' చెట్టును చూసి శాంత పరవశం చెందింది. సాయంసంధ్య సూర్యుడి కిరణాలు పడి పువ్వులు బంగారు నాణాల్లా మిలమిలా మెరుస్తున్నాయి. ఈ పూలను రేపు దేవుడి విగ్రహాన్ని అలంకరించడానికి ఉపయోగి స్తారని చిన్నన్ చెప్పాడు. ఆ తరవాత అతడు చెట్టెక్కి జాగ్రత్తగా పూల గుత్తులు కోసి శాంతకు అందించాడు. ఆమె వాటిని బుట్టలో పెడుతూ, ''అయిపోయాయా? ఇంకా ఉన్నాయా?'' అని అడిగింది.

''లేదు. ఇంకా ఉన్నాయి!'' అంటూ చిన్నన్ ఆమెను ఒక పనస చెట్టు వద్దకు తీసుకువెళ్ళాడు. చెట్టు బోదెకు చాలా పనస పళ్ళు వేళ్ళాళుతున్నాయి. కొన్ని పళ్ళు నేలను తాకుతున్నాయి. చిన్నన్ అడుగున ఉన్న పనసపండు తొడిమను కత్తితో కోసి పండును పక్కన పెట్టి బుట్ట పక్కన కూర్చుంటూ, ''నేను వీటిని ఇంటికి చేర్చివస్తాను. నువ్వు ఇక్కడే ఉండు,'' అన్నాడు.

''ఎందుకు చిన్నన్?'' అని అడిగింది శాంత.

''కణ్ణన్ నిన్ను ఇక్కడి నుంచి తీసుకు వెళతాడు,'' అంటూండగానే కణ్ణన్ అక్కడికి వచ్చాడు.

చిన్నన్ పళ్ళబుట్టను తీసుకుని బయలు దేరాక, కణ్ణన్ శాంతను వెంటబెట్టుకుని కాయగూరల తోట కేసి నడుస్తూ, ''ఇక్కడే మీ అమ్మమ్మ రకరకాల కాయగూరలు పండి స్తుంది. నేనూ, చిన్నన్ ఆమె చెప్పినట్టు విత్తనాలు నాటడం, నీళ్ళు పోయడం, కాయలు కోయడంలాంటి పనులు చేస్తూంటాం,'' అన్నాడు.

''అది సరే. మనం ఇక్కడికి ఎందుకు వచ్చినట్టు?'' అని అడిగింది శాంత.

''విషుకనికి కావలసిన కూరగాయలను కోసుకోవడానికి,'' అంటూ అతడు ఇంకాస్త ముందుకు వెళ్ళాడు. శాంత అతణ్ణి మౌనంగా అనుసరించింది. ఇద్దరూ తీగలు అల్లుకున్న పొదుల్లోకి వెళ్ళారు. కొన్ని తీగలకు దోస కాయలు కనిపించాయి. అల్లి బిల్లిగా అల్లు కున్న తీగలకు పిందెలు, కాయలు, చిన్నవీ, పెద్దవీ ఉండడం చూసి శాంత సంతోషిం చింది. కన్నన్ వాటిలో కొన్నిటిని కోసుకు న్నాడు. ఇంటికి తిరిగి వచ్చి భోజనం ముగిం చాక శాంత తాతయ్య విషుకనిని అమర్చడం ఆసక్తిగా చూసి వెళ్ళి పడుకున్నది.

మరునాడు తెల్లవారుతూం డగా రెండు చల్లని చేతులు శాంత కళ్ళను మూసుకున్నాయి.

## మన దేశం క్విజ్

సుప్రసిద్ధ చరిత్రకారుడు ఎ.ఎల్. బాషం 'ది వండర్ దట్ ఈజ్ ఇండ్' అనే గ్రంథం రాశాడు. ఈ క్విజ్ ద్వారా కొన్ని అద్భుతాలను గుర్తుచేసుకుందాం.



1. కుతుబ్‌మీనార్ ఆవరణలో ఇనుప స్తంభాన్ని నెలకొల్పిన వారెవరు?



2. దక్షిణ భారతదేశ 'నలంద'గా దేనిని చెబుతారు?



3. అశోక చక్రవర్తిని బౌద్ధమతావలంబిగా మార్చిన వారెవరు?



4. కాళిదాసు విరచిత శాకుంతలాన్ని మొట్ట మొదట అనువదించిన విదేశీయుడు ఎవరు?



5. బంగారు నాణాలను అధికంగా వెలువరించిన మొట్ట మొదటి వంశం ఏది?

(సమాధానాలు 74వ పేజీలో)

''శాంతా, ఈ రోజు విషూ కదా. లే... నేను చెప్పేంతవరకు కళ్ళు తెరవద్దు,'' అంటూ శాంత తల్లి ఆమెను పూజగదికేసి నడిపించింది. గదిలోకి అడుగు పెట్టాక, ''ఇప్పుడు కళ్ళు తెరువు,'' అన్నది తల్లి.

శాంత కళ్ళు తెరిచింది. ఎదురుగుండా బంగారు రంగు పువ్వులతో అందంగా అలంకరించబడిన కృష్ణ విగ్రహం. విగ్రహానికి రెండు వైపులా రెండు దీపాలు. విగ్రహానికి ఎదుట ఇత్తడి పాత్ర. బియ్యం, పెసలు, చిక్కుడు, దోస మొదలైన కూరగాయలు, మామిడి, అరటి పళ్ళు ఆ పాత్ర నిండుగా అమర్చబడ్డాయి. పక్కనే పనస పండు. రెండు చిప్పలుగా కొట్టిన కొబ్బరికాయి. వాటిలో వెండి నాణాలు. పాత్రకు మరోవైపు చేనేత బట్టలో చుట్టిన బంగారు ఆభరణాలు.

ఎదురుగా ఉన్న రాగిచట్రం గల పెద్ద అద్దంలో శాంత తన ప్రతిబింబాన్ని-పాత్ర పూలు, పళ్ళు, కాయగూరలు, వెండి, బంగారు కొబ్బరికాయల మధ్య-చూసుకుని మురిసిపోయింది. ఎందుకిలా చేస్తారు? వీటి అర్థం ఏమిటి? అన్న ప్రశ్నలు ఆమె మనసులో కదలాడసాగాయి.

స్నానం ముగించి ఈ ప్రశ్నలన్నిటినీ అడగాలని తాతయ్య వద్దకు పరిగెత్తింది. ''ఆగు,'' అంటూ తాతయ్య తమలపాకులు పచ్చివక్క, ఒక రూపాయి నాణెం ఆమె చేతిలో పెట్టాడు. ''ఇదేమిటి తాతయ్యా?'' అంటూ తన మొదటి ప్రశ్నను అడిగింది శాంత.

''ఈ రోజు విషు. అంటే మనకు కొత్త

సంవత్సరాది. ఈ రోజు డబ్బు ఇవ్వడం, పుచ్చుకోవడం చేస్తే సంవత్సరమంతా సంపదలు వస్తూంటాయన్నది నమ్మకం. అది సరే, ఈ రోజు మొట్టమొదట విషుకనిని ఎందుకు చూస్తామో తెలుసా?'' అని ఆగాడు తాతయ్య.

''తెలియదు, ఎందుకో చెప్పు తాతయ్యా,'' అన్నది శాంత.

''సాధారణంగా చాలా పండుగలలో మనం పంటలకు ప్రాముఖ్యతనిస్తాం. విషు కూడా అలాంటిదే. ఈ రుతువులో మాత్రమే పూచే 'అరళి'ని, ఈ కాలఘట్టంలో కాచే కాయగూరలను, పళ్ళను, విషుకనిలో అమర్చుతాం. పూలూ, పళ్ళూ, కాయగూరలూ, వెండీ, బంగారం చుట్టూగల అద్దంలో మొట్టమొదట మన ప్రతిబింబాన్ని చూడ్డం వల్ల సంవత్సరమంతా సకల ఐశ్వర్యాలు వచ్చి చేరుతాయనీ, అన్నీ శుభాలే జరుగుతాయనీ ఒక విశ్వాసం. పైగా ఇలా చేయడం వల్ల మనం చెట్టు చేమలు, జంతు జాలం నిండిన ప్రకృతిలో అంతర్భాగమనే సత్యాన్ని కూడా గ్రహించకలుగుతామన్న మాట. మొత్తం ప్రకృతిలో మనం ఒక భాగమని విషుకని గుర్తు చేస్తుంది,'' అని వివరించాడు తాతయ్య.

మధ్యాహ్నం విందు భోజనంతో విషుకనిలో ఉంచిన బియ్యం, పప్పులతో పొంగల్ తయారు చేశారు. దానికి తోడు రకరకాల కూరగాయలు. కొత్తగా కోసిన పనస పండు తొనలుచివరగా.

విందు భోజనం ముగించి చుట్టు పక్కల తన ఈడు పిల్లలతో కలిసి శాంత కొంతసేపు ఉయ్యాలలూగింది. ఆమె మనసులో ఒక వింత ఆనందం. ఈ పండుగల వెనక ఉన్న అంతరార్థం తెలుసుకున్న సంతోషం; ప్రకృతి మాత ఒడిలో భద్రంగా ఉన్నాను అన్న తృప్తి ఆమెకు కలిగాయి.

– రోష్ని కుట్టి & మాలతి మోహన్




ఆస్ట్రేలియా


అమెరికా


జర్మనీ


గ్రీస్


చైనా


ఫ్రాన్స్

# ఒలింపిక్ లెక్కలు

## పాల్గొన్న దేశాలు

క్రీడలలో పాల్గొన్న దేశాల సంఖ్యను బట్టి ఒలింపిక్ క్రీడల ప్రాచుర్యాన్ని గ్రహించవచ్చు. 1896లో ఏథెన్స్‌లో జరిగిన ప్రథమ ఆధునిక క్రీడలలో పాల్గొనడానికి 14 దేశాలు మాత్రమే క్రీడాకారులను పంపాయి. 1968లో మెక్సికో నగరంలో జరిగిన క్రీడలలో 112 దేశాలు పాల్గొని మూడు అంకెలను తాకాయి. 1972లో మునీచ్‌లో జరిగిన క్రీడలలో 121 దేశాలు పాల్గొన్నాయి. ఇజ్రాయెల్ నుంచి వచ్చిన ఒక జట్టు నుంచి 11 మంది క్రీడాకారులను ఒక పాలస్తీనా ఉగ్రవాద సంస్థ అపహరించి హతమార్చడంతో క్రీడలను ఆపేశారు. 1976వ సం.లో కొన్ని దేశాలు ఈ క్రీడలను బహిష్కరించాయి. 1980లో 100 కన్నా తక్కువ దేశాలు మాత్రమే పాల్గొన్నాయి. అయినా, 1984లో లాస్ ఏంజెలెస్‌లో 140 దేశాలు రికార్డు స్థాయిలో పాల్గొన్నాయి. 2000వ సం.లో (సిడ్నీ క్రీడలు) ఈ సంఖ్య 199ని అందుకున్నది. ఆ తరవాతి క్రీడలలో (2004-ఏథెన్స్) పాల్గొనడానికి 201 దేశాలు తమ క్రీడాకారులను పంపాయి.

## పతకాల వివరాలు

సిడ్నీ (2000) ఏథెన్స్ (2004)లలో జరిగిన గత రెండు ఒలింపిక్ క్రీడలలో అమెరికా అత్యధిక పతకాలను గెలుచుకున్నది. సిడ్నీలో 36 బంగారు పతకాలు, 39 రజతాలు, 27 కాంస్య పతకాలను ఆ దేశం గెలుచుకున్నది. రష్యా 32 బంగారు, 28 రజతాలు, 27 కాంస్య పతకాలు గెలుచుకున్నది. 2008 క్రీడలకు ఆతిథ్యమివ్వనున్న చీనా 28 బంగారు, 16 రజత పతకాలు, 15 కాంస్య పతకాలు గెలుచుకుని మూడవ స్థానం సాధించింది. ఆస్ట్రేలియా 16 బంగారు, 25 రజత పతకాలు, 17 కాంస్య పతకాలు సాధించి నాలుగవ


ఇటలీ


రష్యా


జపాన్

స్థానంలో వచ్చింది. జర్మనీ, ఫ్రాన్స్, ఇటలీ తలా 13 బంగారు పతకాలతో తరవాతి స్థానాలలో వచ్చాయి.

2004 (ఏథెన్స్)లో అమెరికా 36 బంగారు, 39 రజతాలు, 27 కాంస్య పతకాలు సాధించి మళ్ళీ ప్రథమ స్థానాన్ని అలంకరించింది. చీనా, రష్యా దేశాలు తమ స్థానాలను పరస్పరం మార్చుకున్నాయి. చీనా 32 బంగారు, 17 రజతాలు, 14 కాంస్య పతకాలు; రష్యా 27 బంగారం, 27 రజతాలు, 16 కాంస్య పతకాలు సాధించాయి. ఆస్ట్రేలియా మళ్ళీ 17 బంగారం, 16 రజతాలు, 16 కాంస్య పతకాలతో నాలుగవ స్థానాన్ని నిలబెట్టుకున్నది. జపాను, జర్మనీ, ఫ్రాన్స్, ఇటలీ దేశాలు క్రమంగా 16, 13, 11, 10 బంగారు పతకాలు గెలుచుకున్నాయి. ఆతిథ్యమిచ్చిన గ్రీస్ 6 బంగారు, 6 రజతాలు, 4 కాంస్య పతకాలతో 15వ స్థానంలో నిలబడింది.

## పోటీదారులు

**1896లో** 43 క్రీడలలో 241 క్రీడాకారులు మాత్రమే పోటీ పడ్డారు. ఆ తరవాత ప్యారీస్ (1900)లో జరిగిన క్రీడలలో పోటీదారుల సంఖ్య 1,225 కు పెరిగింది. రోమ్ ఒలింపిక్స్ (1960)లో 5,348 మంది పోటీ పడ్డారు. 1996 అట్లాంటాలో ఈ సంఖ్య 10,000ను అధిగమించింది. చివరగా ఏథెన్స్ (2004)లో జరిగిన క్రీడలలో 301 ఈవెంట్స్‌లో 10,500 పైబడ్డ అథ్లెట్స్ పాల్గొన్నారు.

## కొందరు విజేతలు

**1936** బెర్లిన్ క్రీడలలో విమన్స్ స్ప్రింగ్‌బోర్డ్ ఈవెంట్‌లో బంగారు పతకం సాధించినప్పుడు మార్జొరీ గెస్ట్రింగ్ వయసు 13సం.ల 9 నెలలు మాత్రమే. ఆధునిక క్రీడల చరిత్రలో అతిపిన్న వయసు బంగారు పతక విజేతగా ఆమె పేరు నిలబడిపోయింది. 1984 లాస్ ఏంజెలెస్ క్రీడలలోనే మొట్టమొదటి సారిగా మారథాన్ ఈవెంట్‌లో మహిళలను అనుమతించారు. అమెరికాకు చెందిన జోన్ బెనోయిట్ బంగారు పతకం సాధించారు. 1979, 1983లలో ప్రతిష్ఠాత్మకమైన బోస్టన్ మారథాన్‌లో ఆమె ఛాంపియన్‌గా వచ్చారు.

-(ఇంకావుంది)




**2004** ఏథెన్స్ క్రీడలలో విడుదల చేయబడ్డ పతకం



# పెడబుద్ధి

బ్రహ్మదత్తుడు కాశీనగరాన్ని పరిపాలించే కాలంలో ఒక గ్రామంలో ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. అతను 'వేదభం' అనే మహా మంత్రంలో సిద్ధి పొందాడు. గ్రహాలన్నీ కూటమయ్యే సమయంలో, ఆకాశంవంక చూస్తూ ఆ మంత్రాన్ని పునశ్చరణ చేసినట్టయితే, సరాసరి ఆకాశం నుంచి బంగారు, వెండి, ముత్యం, పగడం, రత్నం, కెంపు, నీలం-ఈ ఏడు వస్తువులూ వర్షిస్తాయి.

మంత్రసిద్ధి గల ఆ బ్రాహ్మణ్ణి ఆశ్రయించి బోధిసత్వుడు, ఆయనకు ప్రియశిష్యుడయ్యాడు. ఒక రోజున శిష్యుణ్ణి వెంటబెట్టుకుని గురువు అరణ్య ప్రాంతానికి చేరుకున్నాడు.

ఆ అరణ్యంలో ఐదువందలమంది గజదొంగలున్నారు. వాళ్ళు గురు, శిష్యులిద్దరినీ అటకాయించారు. ఐతే, ఆ దొంగలలో చిత్రమైన నియమం ఒకటి వున్నది. ఇద్దరు బాటసారులు కలిసి ఆ త్రోవన వచ్చినట్టయితే ఇంటికి పోయి శిక్షారుసుము తెచ్చి తోటివాడిని విడిపించుకోవటానికి అవకాశ మిచ్చి, అందులో ఒకడిని వదిలేస్తారు.

ఆ వచ్చిన బాటసారులు తండ్రీ, కొడుకులైతే తండ్రిని పోయి రమ్మని చెప్పి, రుసుము తెచ్చి కొడుకును విడిపించుకునేటందుకు అవకాశ మిస్తారు. అలానే, తల్లీ కూతురూ ఐతే తల్లినీ, సోదరులైతే అందులో ఒకణ్ణీ, గురు శిష్యులైతే శిష్యుణ్ణీ-ఇలా వదిలిపెట్టడం వాళ్ళకు మామూలు.

ఇప్పుడా వింతదొంగలు బ్రాహ్మణ్ణి తమవద్ద అట్టే పెట్టుకుని, శిష్యుడైన బోధిసత్వుణ్ణి పోయి రమ్మని పంపించారు. వెళ్ళేటప్పుడు బోధిసత్వుడు గురువుకు నమస్కరించాడు. ''గురువర్యా! భయపడకండి. ఒకటి రెండు రోజులలో తప్పక తిరిగి వచ్చేస్తాను. ఐతే, నా మనవి

జాతక కథ

మటుకు ఒక్కటి వినండి: ఇవాళ గ్రహాలన్నీ కూటమయ్యే రోజు. కొంపతీసి ఇవాళ మాత్రం మంత్రం జపించి రత్నాలవర్షం రప్పించకండి. అలా చేశారంటే మీకూ, ఈ దొంగలకూ కూడా తీరని ముప్పు కలిగి తీరుతుంది,'' అని మరిమరి చెబుతూ, బోధిసత్వుడు బయలుదేరి వెళ్ళాడు.

సూర్యాస్తమయం అయింది. దొంగలు వచ్చి బ్రాహ్మణ్ణి పట్టుకున్నారు. పుచ్చ పువ్వు లాటి వెన్నెల కిరణాలను వెదజల్లుతూ పున్నమి చంద్రుడు ఆకాశాన తిరుగుతున్నాడు. బ్రాహ్మడు పైకి చూసి, గ్రహాలు కూటమయ్యే సమయం వస్తుందని పసికట్టాడు. ''దొంగల బారిని పడి, చేతకానివాడిలాగా ఈ హింసలన్నీ ఎందుకు నేననుభవించాలి? చేతిలో వున్న మంత్రాన్ని పఠించి, కనక వర్షం రప్పించి, దొంగల రుసుము వాళ్ళకిచ్చేసి, విడుదలవు తాను. స్వేచ్ఛ పొంది సుఖంగా వుంటాను,'' అనుకున్నాడు.

తరవాత బ్రాహ్మడు ఆ దొంగల గుంపును చేరబిలిచాడు.

''మీరు నన్నెందుకు బంధించారు చెప్పండి!'' అన్నాడు.

''అయ్యా, ఇంకెందుకు? డబ్బు కోసం!'' అన్నారు వాళ్ళు.

''అంతేకదా! అలా ఐతే నేను చెప్పినట్టు చేయండి, మీరు కోరిన ధనం ఇస్తాను. ముందు నా కట్లు విప్పెయ్యండి. నాకు శుభ్రంగా స్నానం చేయించండి. నూతన వస్త్రాలు కట్టబెట్టండి. పుష్పజాతులన్నీ తెచ్చి



ఇక్కడ పోగుపోయండి. నా చుట్టూ పరిమళ ద్రవ్యాలూ, ధూప దీపాదులకు కావలసిన సామగ్రులూ అమర్చిపెట్టండి. అటుపైన ఏం జరుగుతుందో చూడండి!'' అని బ్రాహ్మడు చెప్పాడు.

అక్షరాలా ఆ బ్రాహ్మడు చెప్పిన ప్రకారమే చేశారు దొంగలు. తరవాత ఆయన అదును చూసి, ఆకాశం వంక దృష్టి నిలిపి, వేదభ మంత్రం ఉచ్చరించాడు. వెంటనే విలువ గల లోహాలూ, మణులూ వర్షించినై! దొంగలు గబగబా వాటన్నిటినీ ఏరి మూటలు కట్టుకొని వాళ్ళ దారిని వాళ్ళు పోయారు. వాళ్ళ వెనకనే బ్రాహ్మడూ వెళుతున్నాడు.

ఆ సమయంలో మధ్యదారిలో మరి ఒక దొంగల గుంపు తారసపడి, మొదటి గుంపును ఎదుర్కొన్నది. ''ఎందుకయ్యా, మీరు మమ్మల్ని పట్టుకుంటారు?'' అని అడిగారు మొదటి



దొంగలు. అందుకు రెండవ గుంపు, ''ఇంకెం దుకు, డబ్బుకోసం!'' అన్నారు.

''అంతేకదా! డబ్బుకోసమే ఐతే, ఈ బ్రాహ్మణ్ణి ఆశ్రయించండి. ఈయన ఆకాశం పైకి చూస్తే చాలు, విలువ గల రత్నాలూ, మణులూ వర్షిస్తాయి. అలా చేసే మాకు ఈ ధనమంతా ఇచ్చాడు,'' అని చెప్పి వాళ్ళు తప్పించుకుపోయారు.

ఇప్పుడు రెండవ దొంగలజట్టు బ్రాహ్మణ్ణి వదలక పట్టుకుంది. ''మాకు కూడా ధన మియ్యవయ్యా, బ్రాహ్మడా!'' అని వాళ్ళు బొబ్బలు పెట్టి పీడించసాగారు.

అందుకు బ్రాహ్మడు, ''అయ్యలారా! ఇందాక ఆ దొంగలకు నేనిచ్చింది మంత్ర మహిమవల్ల రప్పించిన ధనం. నేను నేర్చిన మంత్రానికి మళ్ళీ ఒక యేడాదికి గాని శక్తి కలగదు. ఇది నా ఇష్టం వచ్చినప్పుడల్లా జపించితే పని చేసే మంత్రం కాదు. దీని కంతా గ్రహకూటం కలియడం అదీ, చాలా గొడవ వున్నది. దానివల్ల ఇప్పటికి ప్రయో జనం కలగదు కనుక, ఒక్క ఏడాది అయ్యే సరికి, గ్రహాలు కూటమవుతై; అప్పుడు నా మంత్రం జపించి, మీకు కనకవర్షం కురిపి స్తాను,'' అన్నాడు.

బ్రాహ్మడి మాటలు నమ్మలేదు దొంగలు. ''మాకంటే ముందు వచ్చిన వాళ్ళను ఇట్టే కుబేరులను చేసి పంపావే, మేం అడిగితే ఏడాదివరకూ కనిపెట్టుకు ఉండమంటావా, అబద్ధాలకోరా!'' అంటూ పదునైన కత్తి పుచ్చు కుని బ్రాహ్మణ్ని నిలువునా రెండు ముక్క లుగా చీల్చి వేశారు! అతని కళేబరాన్ని దారి మధ్యలో వేలాడదీశారు. ఆ తరవాత గబగబా పరుగులెత్తిపోయి మొదటి దొంగల జట్టును కలిసి, అందరినీ చంపి, వాళ్ళదగ్గిర వుండే ధన ద్రవ్యాలను అపహరించారు. అపహరించిన ధనం వాటాలు తెగలేదు. ఈ రెండవ జట్టు దొంగలలోరెండు కక్షలు ఏర్పడినై. ధనంకోసం రెండు కక్షలవాళ్ళూ పోరాడుకున్నారు.

పోరాటంలో మొత్తం ఒక వంద మంది నరుక్కుచావగా చివరకు ఇద్దరే ఇద్దరు మిగి లారు. ఇలా మిగిలిన దొంగలిద్దరూ ధనాన్నంత టినీ సమీపంలోని ఒక అరణ్యంలో దాచి పెట్టారు. అందులో ఒకడు విచ్చుకత్తులతో ఆ ధనానికి కాపలా కాస్తూ వుండగా, రెండవ వాడు తినుబండారాలు తేవటానికని దాపున వున్న ఊళ్ళోకి వెళ్ళాడు.

ధనాగారం వద్ద కూర్చున్న దొంగ, ''నా నేస్తం వస్తే, అయాచితంగా ఈ ధనంలో సగభాగం కబళించుకుపోతాడే, ఎలా?'' అనే ఆలోచనతో కుమిలిపోసాగాడు.

అక్కడ తినుబండారాలు తీసుకురావటానికి వెళ్ళిన ఆ దొంగ, ''వాడు చస్తే ఆ ధనమంతా నాకే ఉండిపోతుందిగా! కుబేరుడినయిపోవచ్చుకదా!'' అని అనుకొని, తనవంతు పదార్థాలు కేటాయించుకుని, తక్కిన భాగంలో విషం కలిపివేశాడు.

వాడు పదార్థాలు చేతపట్టుకొని తన బస చేరుకునేసరికల్లా ఆ రెండవ దొంగ వీడి పీక తెగవేసి, కళేబరం దూరంగా విసిరి వేశాడు! తరవాత విషం కలిసిన తినుబండారాలు తిని, చివరకు వాడూ ప్రాణాలు విడిచాడు! ఈ విధంగా బ్రాహ్మడూ, బ్రాహ్మడితో పాటు దొంగలూ అంతా, కలిసి మొత్తంగా చచ్చి వూరుకున్నారు.

ఒకటి రెండు రోజులలో బోధిసత్త్వుడు దొంగల కీయవలసిన రుసుము చేత పట్టుకు వచ్చాడు. గురువుకోసం చూశాడు. గురువు కానరాలేదు. ఎక్కడ చూసినా ధనమే! ఎక్కడ చూసినా కళేబరాలే! అప్పుడిలా అనుకున్నాడు బోధిసత్త్వుడు, ''ఈ బ్రాహ్మడు నా మాట చెవిని పెట్టలేదు. తనకు తోచినంతా చేశాడు. మొన్నటి రోజున ఈ బ్రాహ్మడు మంత్రం జపించి, రత్నాలవర్షం రప్పించే వుంటాడు. దాని ఫలితంగానే అందరూ చచ్చివుంటారు,'' అని తలిచి, బాటవెంబడే చూసుకుంటూ పోసాగాడు.



కొంత దూరంలో గురువుగారి కళేబరం కనిపించింది. ''అయ్యో! గురువర్యా, నా మాట విన్నావు కాదుకద! ఎంతటి దుర్గతి పాలయ్యావు!'' అంటూ అతను వాపోయాడు. చితుకులు పోగుచేసి తెచ్చి గురువుకు దహనాది క్రియలు సలిపాడు. అడవిపువ్వులు పట్టుకువచ్చి ఆ స్థలమందు వుంచి, భక్తిపూర్వకంగా తుదిసారి నమస్కరించాడు.

అక్కడినుంచి ఇంకా అలా అలా వెళ్ళగా మొదటి దొంగల జట్టులోని కొందరి శవాలూ కంటపడినై. మరి కొంత దూరంలో రెండవ జట్టులో వుండే దొంగల కళేబరాలు పడివున్నయి.

రెండు తప్ప, బోధిసత్త్వుడికి తను చూసివున్న అందరి కళేబరాలూ లెక్కకు సరీగా కనిపించినై. ఐతే ఆ ఇద్దరూ ఎక్కడికి తప్పించు

కుపోయారా అని ఆలోచించాడు. వాళ్ళు ధనం దోచుకుపోయిన జాడ కనిపెట్టి, ఆ దారినే వెళ్ళగా ఆ దారి బోధిసత్వుణ్ణి ఒక కీకారణ్యంలోకి తీసుకుపోయింది. ఆ అరణ్యంలో ధనం మూటలు కనిపించినై. తప్పిపోయారనుకొన్న ఇద్దరు దొంగల లోనూ ఒకడి కళేబరం కనిపించింది.

ఐతే వాడి పక్కన తినుబండారాలు గల పాత్ర వున్నది. ''ఓహో, ఇదా సంగతి!'' అని అనుకొన్నాడు బోధిసత్వుడు. ఇంకా నాలుగడుగులు వేసే సరికి ఒక మూల ఆ మిగిలి వున్న దొంగ కళేబరం వేలాడదీయబడి వున్నది. ఇంకిప్పుడు ఎవరూ చెప్పనక్కరలేకుండానే జరిగిన సంగతి అంతా బోధిసత్వుడికి మొదటి నుంచి చివరివరకూ అవగాహనై పోయింది.

ఇదంతా చూసి బోధిసత్వుడు చాలా విచారించాడు. ''నా మాట పాటించాడు కాదు గురువుగారు. అంతగా చెప్పి పోయినా, పెడచెవిని పెట్టాడు. ఆత్మబుద్ధి సుఖమనుకున్నాడు. ఇందుకు ఫలితం? తనూ నాశనమయ్యాడు, తనతో పాటు చాలా మంది జనమూ చావటానికి కారకుడయ్యాడు. వివేకవంతుల మాట వినక, తమకు తోచిందే మంచిదని అనుకొని పనులు చేసేవాళ్ళకు ఇటువంటి శాస్తిజరిగే తీరుతుంది.

''నా గురువుగారు తన మంత్ర మహిమ వల్ల భూలోకానికి రప్పించిన ధనసంపద మానవకోటికి ఉపకృతి చేయలేదు సరికదా, పైగా సంఘాత మరణానికీ, అంతులేని వినాశానికీ దారి తీసింది. కనుక, బుద్ధి వక్ర మార్గాన్ని పట్టినప్పుడు మంచి వస్తువులవల్ల కూడా కీడే కలుగుతుంది. దోషం వస్తువులో లేదు, బుద్ధిలో వుంది. వక్రబుద్ధి అగ్నిజ్వాల వంటిది. అది ఒకళ్ళ నాశనంతో పోదు. మరి ఎంతమందినో నాశనం చేస్తేగాని ఆ అగ్ని చల్లారదు,'' ఈ బోధలను బోధిసత్వుడు అరణ్యమంతా మారుమోగేటట్టు ప్రబోధించాడు. తన గురువుగారిని ఉదాహరణగా చూపి, అందరకూ నచ్చేటట్టు చెప్పాడు. బోధిసత్వుడి ప్రబోధానికి వనదేవతలు జేజేలు కొట్టారు.

అటు తరువాత ఆ ధన సంపదనంతటినీ బోధిసత్వుడు తన ఆశ్రమానికి తీసుకుపోయి, అదంతాలోకోపకారం కోసం వినియోగించి, అవతారం చాలించాడు.





# రామాయణం

వానరులు తిరిగి తిరిగి అలిసిపోయి, ఆకలి దప్పులతో అలమటిస్తూ, మయుడు నిర్మించిన ఋక్షబిలం వద్దకు చేరుకున్నారు. అందులోనుంచి పక్షులు ఎగిరి వస్తున్నాయి, సువాసనలు వెలువడుతున్నాయి. కాని బిలానికి అడ్డంగా లతల పొదలు ఉండటం చేత లోపలికి వెళ్ళటం కష్టంగా ఉన్నది.

''ఈ బిలం లోపలినుంచి పక్షులు రావటం చూస్తూంటే, బయట ఉన్న పొదలు నవనవలాడుతూ ఉండటం చూస్తూంటే దీని లోపల బావో, చెరువో ఉంటుందని తోస్తున్నది,'' అన్నాడు హనుమంతుడు.

వెంటనే వానరులు ఆ బిలం లోపలికి ప్రవేశించారు. లోపల గాఢాంధకారం. ఆ కటిక చీకటిలో వారు ఒకరి చేతులొకరు పట్టుకుని ముందుకు పోగా పోగా ఒక అద్భుతమైన ప్రదేశం వచ్చింది. ఆ ప్రదేశం కాంతివంతంగా ఉన్నది. పెద్ద పెద్ద చెట్లున్నాయి. వెండి బంగారాలతో చేసి రత్నాలతో అలంకరించిన ఇళ్ళున్నాయి. బంగారు, వెండి, కంచు పాత్రలు రాసులుగా పోసి ఉన్నాయి. అలాగే అగరు చందనాలూ, ఫలాలూ, పానీయాలూ, బట్టలూ, రత్న కంబళ్ళూ, తోళ్ళూ, బంగారమూ పెద్ద పెద్ద రాసులలో కనిపించాయి.

దగ్గిరలోనే ఒక స్త్రీ కృష్ణాజినమూ, నారబట్టలూ ధరించి, కాంతితో వెలిగిపోతూ తపస్సు చేసుకుంటున్నది.

హనుమంతుడామెను సమీపించి నమస్కరించి, ''నువ్వెవరు? ఇదేమి బిలం? మేము చాలా దూరం ప్రయాణించి, ఆకలి దప్పులతో

కిష్కింధా కాండ-6



అలమటిస్తూ నీరు దొరకుతుందనే ఆశతో తొందరపడి ఈ బిలం ప్రవేశించాం. ఇక్కడి వింతలన్నీ చూస్తే ఇదంతా రాక్షసమాయేమోననిపిస్తున్నది. ఈ ఇళ్ళూ, ఈ పళ్ళూ ఎవరివి? ఇక్కడి స్వచ్ఛమయిన కొలను నీళ్ళలో బంగారు కమలాలూ, బంగారు చేపలూ, బంగారు తాబేళ్ళూ ఎవరి మహిమ చేత కలిగాయి?'' అని అడిగాడు.

దానికి ఆ తపస్విని ఈ విధంగా సమాధానం చెప్పింది:

''దానవుల విశ్వకర్మ అయిన మయుడు ఇక్కడ నివసించేవాడు. ఆయన దీర్ఘ తపస్సు చేసి బ్రహ్మనుంచి గొప్ప వరాలు పొందాడు. ఆయనే తన శక్తిచేత ఈ ప్రదేశం సృష్టించి, హేమ అనే అప్సరతో ఇక్కడ సుఖంగా జీవిస్తూ వచ్చాడు. అది చూసి సహించలేక దేవేంద్రుడు మయుడిపై వజ్రాయుధం ప్రయోగించాడు. తరవాత బ్రహ్మ ఈ ప్రదేశం హేమకిచ్చేశాడు. హేమ నా ఇష్ట సఖి. నేను మేరుసావర్ణి కుమార్తెను. నా పేరు స్వయంప్రభ. ఈ ప్రదేశాన్ని రక్షిస్తూ ఇక్కడ ఉన్నాను. మీ రిక్కడికి ఏ పని మీద వచ్చారు? ఇక్కడి ఫలాలూ నీళ్ళూ పుచ్చుకుని మీ ఆకలి దప్పులు తీర్చుకుని మీ వృత్తాంతం చెప్పండి.''

వానరులందరూ పళ్ళు తిని, నీరు తాగి సంతృప్తులయినాక హనుమంతుడు స్వయంప్రభకు తమ పూర్వోత్తరాలు క్లుప్తంగా ఇలా చెప్పాడు:

''దశరథ మహారాజు కొడుకు రాముడు త్రిలోకాధిపతి అయిన ఇంద్రుడితో సమానుడు. అతను తన తమ్ముడైన లక్ష్మణుడితోనూ, భార్య అయిన సీతతోనూ దండకారణ్యానికి వచ్చాడు. వారు జనస్థానంలో ఉండగా సీతాదేవిని రావణుడు బలాత్కారంగా తీసుకుపోయాడు. రాముడి మిత్రుడైన సుగ్రీవుడు సమస్త వానరులకు రాజు. ఆయన సీతాదేవిని వెతికే నిమిత్తమై మమ్మల్ని దక్షిణ దిశకు పంపాడు. మేము దక్షిణ దిశ అంతా కలయ వెతికి, ఆకలి చెంది, అలసిపోయి ఒక చెట్టు కింద కూచుని ఉండగా లతలు కప్పి ఉన్న గొప్ప అంధకార బిలం కనిపించింది. తడి విదిలించుకుంటూ ఈ బిలం నుంచి పక్షులు బయటికి రావటం చూసి నేనే ఈ వానరులందరినీ ప్రోత్సహింపజేసి బిలంలో ప్రవేశించమన్నాను. మేము ఇలా వచ్చి ఇక్కడ చేరుకున్నాం. అదృష్టవశాన నువ్వు

మాకు తటస్థపడి మా ఆకలి తీర్చి, మేలు చేశావు.''

హనుమంతుడు స్వయంప్రభకు ఈ విధంగా తమ వృత్తాంతమంతా చెప్పి, ''నువ్వు మాకు ప్రాణదానం చేశావు. దీనికి ఏ ప్రత్యుపకారం కోరినా చేస్తాము. మేము ఈ బిలంలో ప్రవేశించామేగాని ఇందులో నుంచి ఎలా బయటపడాలో తెలియటం లేదు,'' అన్నాడు.

స్వయంప్రభ తన కేమీ ప్రత్యుపకారం అవసరం లేదనీ, వానరులంతా కళ్ళు మూసుకుంటే వారిని తన తపశ్శక్తితో బిలం వెలుపల చేర్చుతాననీ అన్నది. వానరులందరూ కళ్ళు మూసి తెరిచేసరికి బిలం వెలుపల ఉన్నారు. స్వయంప్రభ వారున్న చోటికి కొండ గుర్తులు చెప్పి బిలంలోకి వెళ్ళిపోయింది.

వింధ్య పర్వతపు పడమటి పార్శ్వపుటంచున కూచుని, పశ్చిమ సముద్రాన్ని చూస్తూ తమ గడువు ముగిసిందనీ, శిశిరం వెళ్ళి వసంతం కూడా రాబోతోందనీ గుణించుకుని వానరులందరూ చింతలో మునిగిపోయారు.

అప్పుడు అంగదుడు మిగిలిన వానరులతో, ''మనమంతా సుగ్రీవుడి ఆజ్ఞకు లోబడి వచ్చాం. ఆయన చెప్పిన గడువు లోపల సీత జాడ తెలుసుకోలేక పోయాం. ఇప్పటికే ఆయన ఆజ్ఞ మీరిన వాళ్ళమయ్యాం. సుగ్రీవుడు చాలా క్రూరుడు, మీదుమిక్కిలి రాజు. మనని క్షమించడు. ఆయన వద్దకు తిరిగి పోవడం కన్న అన్న పానాలు మాని ప్రాయోపవేశం చేసి చావటం మేలు. కావటానికి నేను యువరాజునే కాని నన్ను యువరాజు చేసినది





సుగ్రీవుడు కాదు, రాముడు. సుగ్రీవుడికి నా మీద చాలా పగ ఉన్నది. నేను ఇప్పుడు అత డికి దొరికితే నన్ను ప్రాణాలతో వదలడు,'' అన్నాడు.

మిగిలిన వానరులు కూడా ఇలాగే భావిం చారు. కనీసం సీత వార్త అయినా తెలిస్తే రాముడు సంతోషించి, గడువు దాటినందుకు శిక్ష పడకుండా చూస్తాడేమో! కాని సీత జాడ తెలియక, గడువు దాటి కిష్కింధకు వెళ్ళటం కన్న ఇక్కడే ఉండిపోవటం మేలని వారు భావించారు. ముఖ్యంగా తారుడు వారితో, ''ఇంత ఆలోచన దేనికి? మీ కిష్టమైతే ఈ బిలంలోనే ఉండి పోదాం,'' అన్నాడు.

అంగదుడి మాటకారితనమూ, ధోరణీ గమనిస్తున్న హనుమంతుడు తనలో, ''అబ్బో, వీడు సుగ్రీవుడి, రాజ్యం కాజేసేలాగే ఉన్నాడే!'' అనుకుని వానరులకూ అంగదుడికీ మధ్య భేదం కలిగించటానికి గాను, ''అంగదుడా, వానరులకు ఈ క్షణం ఉన్న ఆలోచన మరు క్షణం ఉండదు. వీరందరూ భార్యలనూ, బిడ్డ లనూ వదిలేసి నీ ఆజ్ఞలు పాటిస్తూ నిజంగానే ఇక్కడ ఉండి పోతారని నమ్ముతున్నావా? ఉన్న మాట చెబుతాను విను. నేనుగాని, ఈ జాంబ వంతుడుగాని, నీలుడుగాని, సుహోత్రుడు గాని సుగ్రీవుణ్ణి విడిచి నిన్ను అనుసరించటం కల్ల. అదీగాక బలవంతుడితో వైరం కూడదు. ఈ బిలం నిన్ను లక్ష్మణ బాణాల నుంచి కూడా రక్షించ లేదు. తెగ బడి యుద్ధమే చెయ్యటానికైనా నువ్వు వాలి కన్న బలశాలివి కావుగదా! ఈ వానరులందరూ నీ మాట అనుసరిస్తారని భ్రమపడితే త్వరలోనే ఒంటరి గాడివై లేని పోని చిక్కులపాలై పోతావు. సుగ్రీవుడికి నీ పైన పగ అన్నది నిజం కాదు,'' అన్నాడు.

ఈ మాట లేవీ అంగదుడి చెవికెక్కలేదు. అతను కోపావేశంతో, ''సుగ్రీవుడికి స్థిరబుద్ధీ, ఆత్మశుద్ధీ, చిత్తశుద్ధీ, దయా, పరాక్రమమూ, గాంభీర్యమూ ఏ కోశానా లేవు. రాక్షసుడితో పోరటానికి బిలంలోకి దూరిన తన అన్న బయటికి రాకుండా బిలానికి కొండ రాయి అడ్డం పెట్టిన ద్రోహి. తనకు రాజ్య దానం చేసిన రాముణ్ణే మరిచిన కృతఘ్నుడు. లక్ష్మణుడి భయం కొద్దీ సీతాన్వేషణకు గాను మనని పంపాడేగాని అతనికి అధర్మభయం ఎక్క డిది? అటువంటివాడు, తన కొడుక్కు రాజ్య మిస్తాడుగాని నా కిస్తాడా? తన ఆజ్ఞ మీరిన

వంకపెట్టి నన్ను తప్పక ఉరి తీయిస్తాడు. నేను తిరిగి రాను; ఇక్కడే ప్రాయోపవేశం చేస్తాను. నన్ను వదిలి మీరంతా వెళ్ళండి. రామ లక్ష్మణులకూ, మా పినతండ్రికీ, పినతల్లి రుమకూ నా నమస్కారాలు చెప్పండి. నేనంటే ప్రాణంకన్న ఎక్కువగా చూసే నా తల్లిని ఊరడించండి. ఆమె ఎలాగూ నాకోసం ప్రాణాలు విడుస్తుంది,'' అని మిగిలిన వానరులకు నమస్కారాలు చేసి, భూమి మీద దర్భలు పరుచుకుని వాటిపై ఏడుస్తూ పడుకున్నాడు.

అంగదుణ్ణి చూసి వానరులందరికీ ఆగకుండా దుఃఖం వచ్చింది. వాళ్ళు వాలిని మెచ్చుకుని సుగ్రీవుణ్ణి తిట్టుతూ, తాము కూడా ప్రాయోపవేశం చేయ నిశ్చయించారు. సముద్రంలో స్నానం చేసి తీరాన దర్భలు పరిచి వారంతా తూర్పు ముఖంగా పడుకున్నారు. అలా పడుకుని వారు రాముడు అరణ్యవాసానికి బయలుదేరినది మొదలు జరిగినసంఘటనలన్నీ చెప్పుకుంటూ ఉండగా ఒక భయంకరమైన ఆకారం గల గద్ద వారికి కనిపించింది. దానిని చూస్తూనే భయంతో వారు పెట్టిన కేకలకు గుహలన్నీ మారు మోగాయి.

ఆ వచ్చినది జటాయువు అన్న అయిన సంపాతి. అతను వింధ్య పర్వతం మీది ఒక గుహలో ఉంటున్నాడు. అతను గుహలో నుంచి వెలికి వచ్చి, ''దేవుడి దయ వల్ల ఇవాళ నాకు కావలిసినంత ఆహారం! ఈ వానరులందర్నీ వరసగా చంపి కడుపు నింపుకుంటాను,'' అన్నాడు.

ఆ మాటలు విని అంగదుడు హనుమంతుడితో, ''మన కెలాటి గతి పట్టింది?



యముడు ఈ గద్ద రూపంలో మనని కడతేర్చ వచ్చాడు. మనమా రాముడి పని తీర్చిన వాళ్ళమూ కాలేదు, సుగ్రీవాజ్ఞ నిర్వర్తించిన వాళ్ళమూ కాలేదు. మన కన్న ఆ జటాయువు మేలు; అతను రాముడి కోసం ప్రాణాలు వదిలాడు. మనం రామకార్యం మీద బయలు దేరామన్న మాటేగాని అది చెయ్యకుండానే ఈ గద్ద నోట పడబోతున్నాం. మన చావుకు ఎన్ని కలిసి వచ్చాయో! జటాయువు ప్రాణాలు వదలక పోతే మనకు సీతను వెతక వలిసిన పనే ఉండేది కాదు; రావణుడి సంగతి అతనే చెప్పేవాడు. రావణుడు సీత నెత్తుకు పోక పోతే ఆమె కోసం వెతికే పనే ఉండేది కాదు. దశర థుడు చావకపోతే ఏనాడో రాముణ్ణి పిలిపించు కుని ఉండేవాడు. అసలు దశరథుడా కైకేయికి వరాలే ఇవ్వకపోతే ఏ బెడదా ఉండకనేపోను. ఇవన్నీ మన వానరులందరి ప్రాణం తియ్య టానికే జరిగాయి,'' అన్నాడు.

సంపాతి గట్టిగా, ''ఎవడది? నా తమ్ముడు చచ్చిపోయినట్టు మాట్లాడుతున్నాడు! ఇంత కాలానికి నా తమ్ముడి పేరు విన్నాను గదా అని సంతోషించాను. అంతలోనే ఎంతటి దుర్వార్త! నాయనలారా, నా రెక్కలు సూర్య కిరణాలకు కాలిపోయాయి. నేను మీ దగ్గిరికి రాలేను. దయచేసి నన్ను మీరున్న చోటికి దించండి,'' అని అరిచాడు.

వానరులు ఇదంతా దొంగ ఎత్తనుకు న్నారు. అయినా తాము చావటానికి సిద్ధ మయ్యే ఉన్నారు గనక, ఆ చావు ఈ విధంగా త్వరగా రావటం కూడా మేలేనేమోనని వారికి తోచింది. అంగదుడు మాత్రం లేచి వెళ్ళి సంపాతిని కొండ మీది నుంచి దించి కిందికి తెచ్చాడు.

అతను సంపాతితో రాముడు అరణ్యా వాసం రావటమూ, జనస్థానంలో ఉన్న సీతను రావణుడు అపహరించటమూ, అది చూసి జటాయువు రావణుడితో ఘోర యుద్ధం చేసి చనిపోవటమూ, రామలక్ష్మణులు సీతను వెతుక్కుంటూ ఋశ్యమూకానికి వచ్చి, సుగ్రీవుడి స్నేహం చేసి, వాలిని చంపి, వానర రాజ్యాన్ని సుగ్రీవుడి కివ్వటమూ, సుగ్రీవుడు సీతాన్వేషణకై తమను పంపటమూ, తాము విఫలులై, తిరిగి వెళ్ళలేక ప్రాయోపవేశం చెయ్యటమూ వివరించి చెప్పాడు.





# ప్రాణం మీదికి వచ్చిన విద్య

ఒక గ్రామంలో శరభుడు అనే పశువుల కాపరి ఉండేవాడు. వాడి ఆస్తి అంతా కలిసి నాలుగు ఆవులు. వాడు వాటిని రోజూ మేతకు తీసుకుపోయి, ఏ చెట్టు మీదనో, గుట్ట మీదనో కూర్చుని వేణువు ఊదుకుంటూ కాలక్షేపం చేసేవాడు.

ఒక రోజు వాడు ఒక చెట్టు మీద కూర్చుని వేణు గానంలో నిమగ్నుడై ఉండగా సమీపంలో పులిగాండ్రింపు వినిపించింది. వాడు ఉలిక్కిపడి తన ఆవులు మేస్తున్న దిక్కు చూసి, ఒక అపూర్వ దృశ్యం కంటపడే సరికి, నిర్ఘాంతపోయాడు.

శరభుడి ఆవులు నాలుగూ ఒక పెద్దపులిని చుట్టుముట్టి దాన్ని కొమ్ములతో భయంకరంగా పొడుస్తున్నాయి. పులి వాటి నుంచి తప్పించుకుని పారిపోయి, ప్రాణాలు దక్కించుకుందామని విశ్వప్రయత్నం చేస్తున్నది. కాని ఆవులు దానికి సందు ఇయ్యక, చివరకు దాన్ని చంపేశాయి.

శరభుడు తన ఆవుల పౌరుషాన్ని చూసి పరమానందం చెందాడు; చాలా గర్వపడ్డాడు. ఆవులు, ఏమీ జరగనట్టుగా, తిరిగి మేత మేయసాగాయి.

తరవాత కొద్ది కాలానికి శరభుడు ఉండే ప్రాంతంలో వానలు పడక, బీళ్ళు ఎండిపోయి, పశువులకు మేత కరువయింది. తిండిలేక పశువులు ఎండిపోతున్నాయి.

తన ఆవులు తిండికి మాడటం చూడలేక, శరభుడు వాటిని తోలుకుంటూ, దూరంగా ఉన్న కొండప్రాంతానికి వెళ్ళాడు. అక్కడి బయళ్ళలో గడ్డి చాలా ఏపుగా పెరిగి ఉన్నది. అలాటి మేతను మెయ్యటానికి ఆ ప్రాంతంలో పశువులే లేవా అని ఆశ్చర్యపడుతూ, అక్కడికి కూతవేటు దూరంలో ఉన్న ఒక చిన్న గ్రామం

**25-ఏళ్ళనాటి చందమామ కథ**



చేరి, అక్కడ శరభుడు నివాసం ఏర్పాటు చేసుకున్నాడు.

ఆ గ్రామంలో పశువులున్నాయి, కాని వాటికి తిండిపుష్టి లేనట్టు మరీ బక్క చిక్కి ఉన్నాయి.

''కొండ కింద నవనవలాడే మేత ఉండగా, ఏట్లో ప్రయాణం చేసేవాడు దాహంతో చచ్చినట్టు, మీ పశువులు ఇలా బక్క చిక్కి ఉన్నాయేం?'' అని శరభుడు గ్రామస్థులను అడిగాడు.

''ఏం చెప్పమంటావు? కొండ చుట్టూ ఉన్న బీళ్ళలో పులులూ, సింహాలూ చేరాయి. అక్కడికి మేతకు వెళ్ళిన పశువులు మళ్ళీ కనిపించవు. అందుకని మా పశువులను అటుకేసి పోనియ్యం. నువ్వయినా నీ ఆవులను దగ్గిరలో మేపటం మంచిది,'' అన్నారు వాళ్ళు.

''నా ఆవులను పులులూ, సింహాలూ ఏమీ చెయ్యలేవు. వాటి సంగతి మీకు తెలియదు,'' అన్నాడు శరభుడు ఎంతో గొప్పగా.

''వీడికి ఈ ఆవులు, మరెంతో కాలం దక్కవు!'' అని గ్రామస్థులు తమలోతాము అనుకున్నారు.

అసలు సంగతి ఏమిటంటే, కొండ వెనక ఒక దొంగవెధవ, గంగులు అనే వాడు ఉన్నాడు. వాడు పులిలాగానూ, సింహంలాగానూ అరవగలడు. గ్రామానికి చెందిన పశువులు కొండ సమీపంలో మేతకు వచ్చినప్పుడు, వాడు గడ్డిలో దాగి పులిలాగా గాండ్రించి, వాటిని గ్రామానికి దూరంగా పారిపోయేటట్టు చేసి, వాటిని కొండచుట్టి తీసుకుపోయి, ఇతర గ్రామాలలో అమ్మి, డబ్బు చేసుకునే వాడు. వాడు పులిలాగా గాండ్రించటమూ, సింహంలాగా గర్జించటమూ పశువుల కాపర్లకు వినిపించి, నిజంగానే పులి, సింహము వచ్చాయని హడలిపోయి వాళ్ళు గ్రామంకేసి పారిపోయే వారు. ఇలా చాలా పశువులను పోగొట్టుకున్న మీదట పశువులను కొండకేసి తోలుకు పోవటానికి ఎవరూ సాహసించలేకపోయారు.

ఈ సంగతి శరభుడికి కూడా తెలీదు; వాడికి తెలిసినదెల్లా తన ఆవులు పులులకూ, సింహాలకూ భయపడవని మాత్రమే.

చాలా రోజులుగా దొంగిలించటానికి పశువులు దొరకక ఇబ్బంది పడుతున్న దొంగ గంగులు ఒకనాడు శరభుడి ఆవులను

చూశాడు. అవి బాగా బలిసి ఉన్నాయి. వాటి యజమాని శరభుడు ఒక చెట్టు మొదట్లో చేరి, నిశ్చింతగా వేణువు వాయించుకుంటూ వాడికి కనిపించాడు.

గంగులు ఆ ఆవులను కాజెయ్యటానికి నిశ్చయించుకుని, తాను ఏ పొదల మధ్య దాక్కుంటే సులభంగా పని జరుగుతుందో జాగ్రత్తగా చూసుకుని, మర్నాడు పశువుల కన్న ముందుగా వచ్చి, ఆ పొదలో కూర్చున్నాడు.

శరభుడి ఆవులు ఆ ప్రాంతానికి వచ్చి మేయసాగాయి. శరభుడు వేణువు వాయించటం ప్రారంభించాడు. కొంత సేపు గడిచాక వాడికి పెద్దపులి గాండ్రింపు వినిపించింది. అటే కంగారుపడకుండానే వాడు లేచి తన పశువుల కోసం చూశాడు. వాడు అనుకున్నట్టే అవి ఒక పొదకు నాలుగుపక్కలా చేరి, తలలు వంచి, పొదలో నుంచి పులి వచ్చిన మరుక్షణం దాన్ని కుమ్మి, పొడిచీ, చంపటానికి సిద్ధంగా ఉన్నాయి.

శరభుడు వేణువు వాయించడం కట్టిపెట్టి వింత చూస్తూ అలాగే ఉండిపోయాడు.

ఈ లోపల గంగులుకు విచిత్రమైన అనుభవం కలగసాగింది. తన అరుపు విని ఆవులు బెదిరి పారిపోక పోగా, తాను ఆహ్వానించి నట్టుగా పొద దగ్గిరికి వచ్చాయి. వాటికి పులి అంటే భయం తెలియదు కాబోలు ననుకుని, సింహంలాగా గర్జించాడు. ఆవులు ఆ గర్జన విని భయపడక పోగా, బుసలు కొట్టుతూ, గిట్టలతో నేలను గీరి, ''దమ్ము



ఉంటే బయటికిరా! నీ ప్రాణం తీస్తాం!'' అన్న ధోరణిలో కనిపించాయి.

తనకు ఆవులు దక్కకపోగా, తన ప్రాణానికే ప్రమాదం వచ్చిందని గంగులు తెలుసుకునేటందుకు కొంత వ్యవధి పట్టింది. ఆ తరవాత వాడికి ముచ్చెమటలు పోశాయి. వాడు కాస్సేపు పులిలాగా, కాస్సేపు సింహంలాగా మార్చి, మార్చి అరవసాగాడు. అందువల్ల వాడికి ఏమీ ప్రయోజనం కలగకపోగా, ఆవులు మరింత పెద్దగా బుసలు కొట్టసాగాయి.

అయితే, ఆ అరుపులు విని గ్రామం పరిసరాలలో మేస్తున్న పశువులు బెదిరి, అన్ని దిక్కులా పారిపోసాగాయి. కట్టేసి ఉన్న పశువులు కట్టుతాళ్ళు తెంచుకుని మరీ పారిపోయాయి.

ఊరి మనుషులు వాటికోసం అటూ ఇటూ పరిగెత్తసాగారు. ఇంతలో శరభుడు గ్రామం కేసి పరిగెత్తుకుంటూ వచ్చి, ''నా ఆవులు పులినీ, సింహాన్నీ పట్టాయి! చూతురుగాని రండి!'' అంటూ కొంత మందిని తీసుకుపోయాడు. వాళ్ళు ప్రాణాలు అరచేత పట్టుకుని శరభుడి వెంట వెళ్ళారు. తన ఆవులు చుట్టిముట్టి ఉన్న పొదకు సమీపంలో శరభుడు ఆగగానే, ఊరి వాళ్ళు అమిత ఆశ్చర్యంగా, ''ఏదీ పులి?'' అని అడిగారు.

''అది ఒకంతట బయటికి వస్తుందా! నా ఆవులు చీల్చెయ్యవూ? మీరంతా ఆ పొద మీదికి రాళ్ళు విసరండి. పులిలాగానూ, సింహంలాగానూ అరవగల జంతువు బయటికి వస్తుంది!'' అన్నాడు శరభుడు.

నలుగురూ బలంగా రాళ్ళు విసరటం ప్రారంభించగానే శరభుడి ఆవులు పొద నుంచి ఇవతలికి వచ్చేశాయి. తలకూ, ఒంటికీ గాయాలుతగిలి, రక్తం కారుతూన్న దొంగ గంగులు చావుకేకలు పెడుతూ పొదలో నుంచి వెలుపలికి వచ్చి, మనుషుల కాళ్ళ మీద పడ్డాడు.

తమ పశువులను దొంగిలించినవాడు వాడేనని తెలియగానే గ్రామస్థులు వాణ్ణి హెచ్చరించి కొసప్రాణంతో వదిలేశారు. అది మొదలు శరభుడు ఆ గ్రామానికి నాయకుడయ్యాడు. గ్రామంలో పశువులు కొండ కింది బీళ్ళలో మేసి, చక్కగా బలిశాయి.



27

చిత్రాలు: గాంధి అయ్య

# అజేయుడు గరుడుడు!

కొండగుహల నుంచి ఇద్దరు అంగరక్షకులతో బయలుదేరిన విక్రమసింహుడు మార్గ మధ్యంలో బాణాల దెబ్బలకు గురై వెనుదిరిగాడు. గాయపడిన మరో యువకుణ్ణి గూడెంలోని గుడిసెలోకి తీసుకు వెళ్ళారు. ఈ సంఘటన గురించి కోయదంపతులు ఆదిత్యుడికి చెప్పారు.

ఆదిత్యుడు గుడిసెలోకి వెళ్ళాడు. వైద్యుడు యువకుడికి చికిత్స చేస్తున్నాడు.

అతడెలా ఉన్నాడు? ఏమైనా చెప్పాడా?

వజ్రపురి రాజుకు అంగరక్షకుడిగా చంద్రపురికి బయలుదేరిన విషయం అతనికి జ్ఞాపకం ఉన్నది.

ఇంకా సరిగ్గా స్పృహ రాలేదు.

అతణ్ణి జాగ్రత్తగా చూసుకో!

విక్రమసింహుడు చంద్రపురికి బయలుదేరడమా? ఇది రవీంద్రదేవుడి కుట్ర అయి ఉంటుంది. దీనిని గురించి మరింత తెలుసుకోవాలి.

ఆదిత్యుడు తన అంగరక్షకుణ్ణి కలుసుకున్నాడు.

గుహాలయాలకు ఒంటరిగా వెళ్ళడం క్షేమం కాదు. నాగబంధు అనుచరుల పట్ల అప్రమత్తతతో ఉండాలి.

నన్ను గురించి భయపడవద్దు.

తమ వెంటరావడానికి ఒకవిలుకాణ్ణి ఏర్పాటు చేస్తాను.

అది చాలు. చాలా కృతజ్ఞతలు.


అక్కడ విక్రమసింహుణ్ణి తీసుకెళ్ళిన కోయయువకుడు గుహను సమీపించాడు.


భూతవైద్యుణ్ణి చూడగానే కిందికి దిగాడు.


రాజు విక్రమసింహుడు తీవ్రంగా గాయపడ్డాడు.
విక్రమసింహుడు గాయపడ్డాడా?
అతణ్ణి ఇక్కడికి తీసుకురా.


విక్రమసింహుణ్ణి గుహలోకి మోసుకువెళ్ళారు.


అతణ్ణి నేలపై పడుకోబెట్టారు.
ఇందుకు ఏమైనా మందులు ఉన్నాయా?
ఆయన స్పృహ కోల్పోయాడు, అంతే.
ఆయనకు తగిలిన బాణాలు విషపూరితాలు కావచ్చు.


అవును, వాటికి మూలికారసం కనిపించింది.
ఇతణ్ణి ఇక్కడే విశ్రాంతి తీసుకోనివ్వండి. ఇతణ్ణి చంద్రపురి మీదికి పంపాను. ఇలా అయింది!


రవీంద్రదేవుడు ఆగ్రహానికి లోనయ్యాడు.
నన్ను గుహాలయానికి తీసుకువెళ్ళండి. నాగబంధు శక్తులను మరెవరైనా ఉచ్చాటనం చెయ్యాలి.


నేను మహా యజ్ఞానికి కావలసిన ఏర్పాట్లు ప్రారంభించాను.
అయితే, ఆదిత్యుడు ఎక్కడ?
అతడు త్వరలో మనవద్దకు రాగలడనే నా మనసు చెబుతోంది.


ఆదిత్యుడు, కోయ అంగరక్షకుడు గుహాలయం కేసి వేగంగా వస్తున్నారు.
ఆదిత్యుణ్ణి అందుకోవడానికి యువకుడు వేగం పెంచాడు.
ప్రభూ! ఆగండి.


యువకుడి పిలుపు విని ఆదిత్యుడు ఆగాడు.
ఏమయింది?
ప్రభూ, తమకు డప్పుల మోతలు వినిపిస్తున్నాయా?


మరేవో వింత శబ్దాలు కూడా వినిపిస్తున్నాయి.
అప్పుడు మనం త్వరగా వెళ్ళాలి.
కాలినడకనే వెళ్ళడం మంచిది.


కోయ యువకుడు ముందు వెళుతూంటే, ఆదిత్యుడు అతణ్ణి అనుసరించాడు.


ప్రభూ! మార్గమధ్యంలోనే గిరిజామాత ఆలయం ఉన్నది. ప్రస్తుతం శిథిలావస్థలో ఉన్నది. మేము ఆ దేవతను మా తల్లిగా కొలుస్తాం.
అక్కడికి వెళదాం పద.


వాళ్ళు ఆలయంలో ప్రవేశించారు.
నేను కొంతసేపు ఇక్కడ ధ్యానం చేస్తాను.
తమరెంతో భాగ్యవంతులు ప్రభూ!


ఆదిత్యుడికి ఒక కంఠస్వరం వినిపించింది. ఆయనకు గరుడుడి రూపం కనిపించింది.
నాయనా! దుష్టశక్తుల మీది పోరాటంలో నువ్వు అంతిమదశను చేరుకుంటున్నావు.




శత్రువులను ఎదుర్కోవడానికి చాలినంత శక్తిని పొందిన భావన ఆదిత్యుడిలో కలిగింది.

-(ఇంకావుంది)

# VALOUR & ADVENTURE
# HUMOUR & MYSTERY
# MORALS & HEROES

Enthralling stories of six decades come together
in one incomparable collection




The Chandamama
60th Anniversary Collectors Edition

**Limited Copies!**
HARDCOVER
MRP: Rs 449

**You pay: Rs 360 only!**
Includes shipping and handling




COLLECTORS EDITION

Take a trip down memory lane with the magazine's oldest editors, discover the beginnings of Chandamama and view some of the most memorable cover art across the decades.

# చందమామ కబుర్లు

## మలయాళం కూడా




ఇంతవరకు తమిళం, తెలుగు బోధిస్తున్న జెరూసలెంలోని హిబ్రూవిశ్వవిద్యాలయం ప్రస్తుతం మలయాళాన్ని కూడా భాషా బోధన పాఠ్యాంశంలో ప్రవేశపెట్టింది. గత కొన్ని సంవత్సరాలుగా 20,000 మంది యూదులు కొచిన్ నుంచి ఇజ్రాయెల్‌కు వలస వెళ్ళాక ఇది జరిగింది. ''వైభవోపేతమైన దక్షిణ భారతదేశ సంస్కృతిని పూర్తిగా అర్థంచేసుకోవడానికి మలయాళం నేర్చుకోవడం ముఖ్యం,'' అన్నారు ఇండియన్ స్టడీస్ శాఖ ఛైర్మన్ యోహానన్ గ్రిస్పాన్. మలయాళం నేర్చుకుంటూన్న విద్యార్థి అలెక్స్ చెర్నియాక్, ''చాలా మధురమైన భాష. త్వరలో క్షుణ్ణంగా నేర్చుకుంటాను,'' అన్నాడు.

## దేవాలయానికి గిన్నిస్‌లో స్థానం

ఢిల్లీలోని అక్షర్‌ధామ్ దేవాలయం గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్‌లో స్థానం సంపాదించుకున్నది. అందులో స్థానం సంపాదించుకున్న మొట్టమొదటి హిందూ దేవాలయం ఇది అన్నది మరో విశేషం. ఈ పుస్తకం దీనిని, ''ప్రపంచంలోకెల్లా అతి పెద్ద హిందూ దేవాలయ ప్రాంగణం''గా పేర్కొంటున్నది. ఆలయం చుట్టూ తీర్చిదిద్దిన పచ్చిక బయళ్ళు 84,342 చ.అ. వరకు విస్తరించి ఉన్నాయి. ప్రధాన ఆలయం 356 అడుగుల పొడవు, 316 అడుగుల వెడల్పు, 141 అడుగుల ఎత్తు కలిగి ఉన్నది. ఆలయంలోని దేవుడు స్వామి నారాయణ్. గిన్నిస్ బుక్

మన వారసత్వ స్థలాలు

# ఛత్రపతి శివాజీ టెర్మినస్



బహుశా ముంబై ఛత్రపతి శివాజీ టెర్మినస్ తప్ప, ప్రపంచంలో మరే రైల్వే స్టేషన్ను ప్రపంచ వారసత్వ స్థలంగా ప్రకటించి ఉండకపోవచ్చు. దీనిని తొలి రోజుల్లో విక్టోరియా టెర్మినస్ వి.టి. అనీ సి.ఎస్.టి అనీ పిలిచేవారు. 1888లో ప్రారంభమైన దీని నిర్మాణం పనులు మరో పదేళ్ళు కొనసాగాయి. ఫ్రెడరిక్ విలియం స్టీవెన్స్ అనే ఆర్కిటెక్ట్ స్టేషన్ను డిజైన్ చేశాడు. ఇప్పటిలా ఆ రోజుల్లో మోడల్ తయారుచేసేవారుకారు. అయితే అలెక్స్ హార్మన్ అనే డ్రాఫ్ట్స్‌మేన్ వాటర్ కలర్ స్కెచ్ చేశాడు. కాంట్రాక్టు పొందాక స్టీవెన్స్ యూరపును పది నెలల పాటు పర్యటించి అక్కడి రైల్వే స్టేషన్లను క్షుణ్ణంగా అధ్యయనం చేసి వచ్చాడు. విక్టోరియా టెర్మినస్‌కూ, లండన్‌లోని సెయింట్ ప్రాంక్రాస్ స్టేషన్‌కూ కొంత పోలిక ఉన్నట్టు చెబుతారు. అప్పటి చక్రవర్తిని విక్టోరియా రాణి పేరును దానికి పెట్టారు. 1996లో మహారాష్ట్ర ప్రభుత్వం దానిని మార్చి, సుప్రసిద్ధ మరాఠా పాలకుడు ఛత్రపతి శివాజీ పేరును పెట్టింది.

స్టేషన్ భవనాన్ని ఇటాలియన్-గోతిక్ మరియు సంప్రదాయ భారతీయ శిల్పకళా అంశాలను మేళవించి నిర్మించారు. కొయ్య చెక్కడాలు, టైల్స్, అలంకారాలుగా ఉన్న ఇనుప, ఇత్తడి పట్టాలు, మెట్లకు వున్న బాలస్ట్రేడ్స్ ఇక్కడి విలక్షణమైన ఆకర్షణలుగా చెప్పవచ్చు. వీటిలో చాలా వాటిని బాంబే స్కూల్ ఆఫ్ ఆర్ట్ విద్యార్థులు మలిచారు.

మన దేశంలో అధికమైన రాకపోకలుగల స్టేషన్లలో ముఖ్యమైనదైన దీనికి 2004 జూలై 2వ తేదీ ప్రపంచవారసత్వ అంతస్థు ఇచ్చారు. యునెస్కో వరల్డ్ హెరిటేజ్ కమిటీ ''ప్రభావాల ముఖ్యమైన ఇంటర్‌ఛేంజ్‌ని ఇది వ్యక్తీకరిస్తున్న''ట్టు పేర్కొన్నది.

చందమామ క్విజ్ - 1 (ఫిబ్రవరి '08)

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఎంట్రీలు పాఠకుల నుంచి ఒక్కటీ రాలేదు.

అందువల్ల బహుమతి ఇవ్వలేక పోతున్నాం.

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



KALANIKETAN BALU



KALANIKETAN BALU



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు జూన్ 2008 సంచికలో ప్రచురిస్తాం.
ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, జెవిఎల్ ప్లాజా 6వ అంతస్తు, 626, అన్నాసాలై, తేనాంపేట, చెన్నయ్ - 600 018

## అభినందనలు

ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు
ఎం. శంకర్‌రెడ్డి
కృష్ణమందిర్ రోడ్
బెల్లంపల్లి - 504 251
(ఆం.ప్ర.)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో : పంచకట్టి పయనమయ్యావు ఎటూ?
రెండవ ఫోటో : తొందరగా తిను ఎవరైనా వస్తారు ఇటు!

## సమాధానాలు :

1. చంద్రగుప్త విక్రమాదిత్యుడు 2. కాంచీపురం 3. ఉపగుప్తుడు
4. విలియమ్ జోన్స్ 5. కుషాణులు

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, JVL Plaza, 6th Floor, 626 (Old 501), Anna Salai, Teynampet, Chennai - 600 018. Editor : B. Viswanatha Reddi (Viswam)

# బాల్యం నుంచి మేము పెరిగింది
# ఆంధ్రాబ్యాంక్ యొక్క కిడ్డి బ్యాంక్ తో

## ప్రస్తుతం మా పిల్లలు కూడా అలాగే పెరగాలని కోరుకుంటున్నాము.




ప్రత్యేకించి పిల్లల కోసం, పిల్లల ప్రత్యేక పొదుపు పథకం **"ఎబి కిడ్డి బ్యాంక్"** ను ఆంధ్రాబ్యాంక్ వారు పునఃప్రవేశపెడుతున్నారు.
ఈ పథకం ప్రత్యేకమైన బొమ్మతో పాటు అనేక ప్రత్యేకతలను కలిగియున్నది.
నేడే మీ పిల్లల కోసం ఈ ఖాతాని ప్రారంభించి, చిన్న వయస్సులోనే వారిలో పొదుపు అలవాట్లను నేర్పించండి.

**ఆంధ్రాబ్యాంక్ आन्ध्रा बैंक ANDHRA BANK**

(భారత ప్రభుత్వ సంస్థ)

**Much more to do, with YOU in focus**

CHANDAMAMA (Telugu) April 2008 RNI No. 1114/57. Regd No. TN/CC(S)Dn/159/06-08
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/06-08, Foreign No. 85/06-08






# బుబ్బా సాహసాలు

బుబ్బా అద్దం ముందు నిలబడ్డాడు. అద్దంలో బుబ్బా ఆకారం కనిపించింది.

హలో! నువ్వు ఎలా ఉన్నావు?

హలో! నువ్వు ఎలా ఉన్నావు?

ఏమిటి విశేషాలు? చెప్పు మిత్రమా!

నువ్వు చెప్పు మిత్రమా, ఏమిటి విశేషాలు?

బుబ్బా అక్కడి నుంచి వెళ్ళి, తలకు హ్యాట్ పెట్టుకుని తిరిగివచ్చాడు.

నా హ్యాట్ ఎలా వుంది? అవునూ, నా హ్యాట్ లాంటిదే నీకు ఎక్కడ లభించింది?

నువ్వు కొన్న చోటే దీన్నీ కొన్నాను.

అలాగా! గుర్తొచ్చింది. నీకు ఒకటి చూపాలను కుంటున్నాను!

నా దగ్గర కూడా నీకు చూపడానికి ఒకటి ఉంది.

ఆహా! ఇదిగో బుబాలూ!

ఆహా! ఇదిగో చూడు బుబాలూ!

బుబ్బా అద్దంలోని ప్రతిబింబం మీదికి ద్రవాన్ని చిమ్మాడు. అది నారింజ రంగులో ఉంది.

బుబ్బాలూ! జ్యూసీ మస్తీ!

కాస్త వేచి చూడు!

ఈ లేత ఎరుపు రంగు చూడు! మస్తీ!

అదెలా ఉంది!

బుబ్బా, ప్రతిబింబం రెండూ ద్రవాన్ని తమ నోళ్ళల్లో పిండుకున్నారు.

ఆహా! నారింజ మస్తీ!

ఆహాహా! లేత ఎరుపు మస్తీ!

మిక్స్‌డ్ ఫ్రూట్ లేదా స్ట్రాబెర్రీ! బుబ్బాలూ జ్యూసీ మస్తీ!

Bubbaloo

Bubbaloo